

పుట్టుక 2 - 8 - 1924

విద్య బి. ఏ. దాకా.

కుటుంబ నియంత్రణలో శిక్షణ.

మహిళోద్యమ కార్యకర్త, వక్త,

బహుగ్రంథకర్త.

# మల్లాది సుబ్బమ్మ

రచయిత్రి పుట్టింది, మెట్టింది సనాతన హిందూకుటుంబంలో. విద్యా విజ్ఞానా లెరుగని సామాన్య గృహిణిగా 36 సం॥ జీవితాన్ని సాగించారు. 38 వ ఏట మెట్రిక్ పాసయినారు. పి. యు. సి పూర్తయి బి. ఏ. చేసిన తర్వాత జిల్లా కుటుంబ నియంత్రణ గౌరవ ప్రచారకులుగా చేశారు. తన విద్వత్తును పెంచుకుంటూ స్త్రీ జనాభ్యుదయానికి ప్రాముఖ్యత ఇవ్వసాగారు. ఎం. ఎన్. రాయ్ ప్రతిపాదించిన నవ్యమానవవాద సిద్ధాంతాన్ని చేపట్టి భారతదేశంలోను, తెలుగునాట ఆ ఉద్యమ కృషి కొనసాగిస్తున్నారు. హేతువాద ఉద్యమవ్యాప్తికి దోహదం చేస్తున్నారు. మహిళాభ్యుదయ సంస్థ అధ్యక్షులుగా వుంటూ స్త్రీల సమస్యలపై సెమినార్లు, చర్చా వేదికలు నిర్వహిస్తున్నారు. అభ్యుదయ వివాహ వేదిక స్థాపించి దానికి డైరెక్టరుగా అనేక కులాంతర, మతాంతర, వరకట్నరహిత వివాహాలు చేస్తున్నారు. మహిళలకొక గ్రంథాలయాన్ని నెలకొల్పారు. తన ధనంతో 'మల్లాది సుబ్బమ్మ ట్రస్టు' ను నిర్మించారు. వైవాహిక, కుటుంబసలహా కేంద్రం ఫౌండర్ సెక్రెటరీగా వుంటూ యువతకు సలహాలిస్తూ వుంటారు.

రచన, ప్రబోధం, సేవాకార్యక్రమం ఈ మూడు ఆమెకు జీవగర్రలు. ఆమె వ్రాసిన 180 వ్యాసాలు 9 సంకలనాలుగా వెలువడ్డాయి. 5 నవలలు 1 కథాసంకలనం వెలుగుచూచాయి. ఇస్లాం: స్త్రీలు; క్రైస్తవం: స్త్రీలు అనే విమర్శనాత్మకగ్రంథాలు ప్రచురితమైనాయి. ఇంగ్లీషులో మూడు పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. స్త్రీ జన ప్రబోధంపై వందల ఉపన్యాసాలు, చర్చలు, రేడియో టీ వి. ప్రసంగాలు చేశారు. తన శ్రమ, డబ్బు, కాలము సద్వినియోగం చేస్తూ ఎప్పుడూ 'బిజీ'గా వుండాలనేదే సుబ్బమ్మగారి ధ్యేయం. నలుగురు పిల్లలతల్లి; అఖిలభారత హ్యూమనిష్టు సంఘ అధ్యక్షులు శ్రీ. ఎం. వి. రామమూర్తి ఈమె భర్త. 1978 లో యూరప్ పర్యటించి వచ్చారు.

# బంగారు సంకెళ్ళు

## మల్లాది సుబ్బమ్మ




ప్రజాస్వామ్య ప్రచురణలు ప్రైవేట్ లిమిటెడ్

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం,

హైదరాబాద్-500 028

ప్రజాస్వామ్య ప్రచురణలు నెం. 3?

బంగారు సంకెళ్ళు

రచన: మల్లాది సుబ్బమ్మ

ప్రథమ ముద్రణ 1984

ప్రతులు 2000



పబ్లిషర్సు:-

ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్

హైదరాబాద్ - 500 028

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:-

వికాసం

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,

మెహిదీపట్నం, హైదరాబాద్

పిన్: 500 028 ఫోను: 31423

వెల రు. [illegible]

ముద్రణ :

లిబర్టి ప్రింటర్స్

చీరాల - 523 155

# విషయ సూచిక

# ముందుగా నాతో ముచ్చటిస్తారా?

"No Nation can survive half slave and half free" అన్నాడు అబ్రహాం లింకన్. ఆనాడు బానిసవ్యవస్థ గురించి లింకన్ మహాశయుడు చెప్పినమాట నాటినుండి నేటివరకు స్త్రీ పట్ల నిజమైంది. భారత స్త్రీ స్థానం చాలా పవిత్రమైనదని, పూజనీయమైనదనే భావం ప్రబలంగా వుంది. ఏ ఒక్క రాజ్యాధినేతనో, ఏ ఒక్కరిద్దరి విదుషీమణుల పేర్లనో ఉచ్చరిస్తూ ఇది దేశ స్త్రీలందరికీ వర్తిస్తుందని వాపిస్తారు. ఇది వట్టికల్ల. ఆనాడూ, ఈనాడూ కూడా 99 శాతం స్త్రీలు పురుష దురహంకారం క్రింద అణగి మణగి వుంటున్నారనేది నగ్నసత్యం. ధనం, ధాన్యం, ఇల్లు, పొలం లాగానే స్త్రీనికూడా తమ ఆస్తిగా పరిగణించడమనేది సత్యదూరం కాదు. తరతరాల స్త్రీ అణచివేతవల్ల స్త్రీ స్థానం ఇలా దిగజారింది. సనాతనభావాలు, మతం ఆమెపై వికటాట్టహాసం చేసినై. ఆత్మవిశ్వాసంలేని పరాధీన బ్రతుకులో రక్షణే శరణ్యమని విశ్వసించింది. అలా ఆమె ఆ బంధాలలో మురిసిపొయ్యేది. అవి బంగారు సంకెళ్ళని తెలియనిస్థితే భారతనారీ పరిస్థితి. ఇంతవరకు తమ బంగారు ఆభరణాలను, వస్తువాహనాలను, ఇతర ఆస్తిపాస్తులను చూచి ఎంతో ఉప్పొంగి పొయ్యేది. వాటిపై హక్కు భర్తలదని, తాము వాటికి రక్షకులు మాత్రమేనని ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నారు. అంతేకాక వాటి యెరచూపి తమవల్ల సర్వ సౌఖ్యాలు అనుభవిస్తున్నారని అర్థమవుతున్నది వారికి ఇప్పుడు. జరిగినదంతా కలఅని ఇప్పుడిప్పుడే గుర్తిస్తున్నారు. దానికితోడు మహిళా దశాబ్దంవచ్చి మహిళల్లో జిజ్ఞాసను రేకెత్తించింది. క్రమంగా తమ బంగారు నగలమధ్య నున్న బంధాలే వారిపాలిట బంగారు సంకెళ్ళయి తమని అధఃపాతాళానికి తొక్కేశాయని గ్రహించారు. తదాది ఆ సంకెళ్ళు గలగలా కొట్టుకోవటం ప్రారంభించాయి. ఇది స్త్రీ విమోచనకు నాందిగా భావించవచ్చు.

ఈ సందర్భంలో సాహిత్యం స్త్రీలలో కనువిప్పు కలిగించే విధంలో రాయాలి. స్త్రీల అంగాంగ వర్ణనలు చేస్తూ కేవలం విలాసవస్తువుగా చిత్రించే ప్రబంధాల విషసంస్కృతిని నిరసించే రచనలు రావాలి. అలాంటి రాక్షస రచనల స్థానంలో ఆధునిక భావాలు ప్రోది కావాలి. నేటి సాహిత్యం స్త్రీలలో జాగృతి, చైతన్యం

కలిగించాలి. కాల్పనిక జగత్తు విడిచి, నేలమీద నిలిచి వాస్తవాలను చిత్రిస్తూ పరిష్కారాలను సూచించే రచనలకే విలువఇవ్వాలి. అప్పుడే మనలోనున్న అర్థరహిత సాంప్రదాయాలు, వ్యవస్థీకృత మూఢవిశ్వాసాలు నశిస్తాయి. అలాంటి చిత్తశుద్ధితో సమూల మార్పును కోరే ఒక ఉద్యమాన్ని మనం నిర్మించుకోవాలి. దానికి ప్రతిస్త్రీ సిద్ధంగావుండి తన భవిష్యత్తుపై నిర్ణయాలు తానే తీసుకోవాలి పరాకర్షిపై ఆధారపడి బ్రతికే పద్ధతిని విడనాడాలి. అన్యాయానికి దోపిడీకి వ్యతిరేకత చూపడానికి సిద్ధపడాలి. అలా స్త్రీ ఉద్యమాలలోకి దూకిననాడే ఆమె బంగారు సంకెళ్ళు బదాబదలవుతాయి. తన స్థానాన్ని నిలుపుకోగలుగుతుంది.

'బంగారు సంకెళ్ళ' లోని నా వ్యాసాలు అన్నీ అనేక వార, పక్ష, మాస, దిన పత్రికలలో ప్రచురితమైనవే. రేడియో ప్రసంగాలు కొన్ని, చర్చవేదికలకు సెమినార్లకు వర్కు-పేపరుగా వ్రాసినవి మరికొన్ని కూడా వున్నాయి. పత్రికలవారందరికీ నాధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. ఈ పుస్తక ప్రచురణకు తోడ్పడుటేకాక, నాకనేక సలహాలను అందించి నా ఈ ప్రయత్నానికి తోడ్పడిన నా సహచరులు, జీవిత భాగస్వామి అయిన శ్రీ. ఎం. వి. రామమూర్తి గారికి నేను కృతజ్ఞతలు చెప్పవలసి ఉన్నది.

రచయిత

"మల్లాది"

# ఆడవారికి ఆస్తి హక్కు

ఈనాడు అమల్లో వున్న హిందూ వారసత్వ విధానంలో స్త్రీలకు లభిస్తున్న ఆస్తి హక్కులవల్ల వారికి గొప్పగా లాభించేది ఏమీలేదని చెప్పటం అంత కష్టమేమీ కాదు. 1937 చట్టం ప్రకారం భర్త ఆస్తి విధవరాలికి చెందేది. దానిమీద జీవిత కాలపు హక్కు వుండేది. 1956 లో వచ్చిన సవరణల వల్ల ఆ ఆస్తి మీద సర్వహక్కులు భార్యకు సంక్రమించాయి. 56 లో మరో సవరణ వచ్చి ఆమెకు లభించే వాటా నీరుకారిపోయింది. అంటే పిత్రార్జితపు ఆస్తిలో భర్త వాటాకు అతని తల్లి, భార్య, ఆడపిల్లలు, మగపిల్లలూ అంతా సమానభాగస్తులైనారు. అందువల్ల సంతానాన్నిబట్టి భార్యకు వాటా తగ్గి సర్వహక్కులూ వచ్చాయి. కుమారుడికి పిత్రార్జితంలో భాగం, తండ్రి ఆస్తిలో వాటా రెండూ వస్తాయి. ఈ సవరణవల్ల తల్లికి మాత్రం చాలా తక్కువ వాటా వస్తుంది.

ఇస్లాం చట్టం ప్రకారం సంతానం లేకపోతే తల్లికి $\frac{1}{4}$ వ వంతు ఆస్తి వస్తుంది. బిడ్డలుంటే $\frac{1}{8}$ వ వంతు వస్తుంది. ఇది సర్వహక్కులతో సంక్రమిస్తుంది. మిగతా ఆస్తిలో కూతుళ్ళకు రెట్టింపు కొడుకులకు చెందుతుంది. కనుక ఇస్లాంలో భార్యకు తక్కువ వాటా ఒకటి; కొడుకు వాటాలో కూతురికి సగం మాత్రమే చెందటం మరొకటి. ఈ రెండు విధాల స్త్రీకి న్యాయం జరగడంలేదు.

1925 భారత క్రైస్తవ వారసత్వ శాసనం ప్రకారం భార్యకు మూడవవంతు భాగం వస్తుంది. సంతానంలేని స్త్రీకి సగం వాటాకు హక్కువుంది. దీనివల్ల భార్యకు సర్వహక్కులతో మూడవవంతు వస్తుంది. పైగా కూతురికి కొడుకుకు తేడా వుండదు. కనుక మొత్తంమీద హిందూస్త్రీకి పెద్దగా లాభించడం లేదు. ఇస్లాంలోనూ అంతే. కాకపోతే క్రైస్తవశాసనంలో కూతురివాటాకు, కొడుకు వాటాకూ తేడాలేదు. సమానత్వం వున్నా అసలులో లాభాలు తక్కువ.

ఏ ఏ సదుపాయాలు ఉండాలని చర్చించేముందు ప్రస్తుతం పెట్టేబిల్లు కూతురు, కొడుకులమధ్య తేడా తీసేస్తున్నది. కాని భార్యకు జరుగుతున్న అన్యాయాన్ని తొలగించటంలేదు. పైగా ఈ బిల్లు కేవలం హిందువులకు మాత్రమే వర్తిస్తుంది. ఇతర మతాల స్త్రీలకు న్యాయం జరిగే అవకాశం లేదు. అసలు పిత్రార్జితపు ఆస్తిలో పుట్టుకతో ఆస్తి హక్కు తీసెయ్యాలి. ఆ ఆస్తిలో పిల్లలున్నా భార్యకే సగం వాటా చెందాలి. అప్పుడే స్త్రీకి సరియైన న్యాయం జరుగుతుంది. భార్యగా న్యాయం జరిగితే కూతురిగా న్యాయం జరక్కపోయినా ఫరవాలేదు. తల్లి తన బిడ్డలికి న్యాయం చేయకపోదు.

1956 లో ఆమోదించబడిన హిందూ వారసత్వ చట్టాన్ని సవరణ చేస్తుంది నేటి బిల్లు. పిత్రార్జితపు ఆస్తిలో ఆడపిల్లకు వాటా లేనందువల్ల వరకట్నాలు పుట్టి అవి

సాంఘిక దురాచారంగా మారిందని, సమానత్వం అనేది మౌలికంగా రాజ్యాంగంలో రాయబడింది కనుక సమానత్వం సాధించటానికి అవసరమని, ఈ బిల్లువల్ల వరకట్నం పోతుందని బిల్లులో రాశారు. కుమారునికి పుట్టుకతో ఎంత వాటా వుందో; ఎలాంటి హక్కు వుందో అంతా కూతురికి వస్తుంది ఈ బిల్లువల్ల. మన రాజ్యాంగ చట్టం ప్రకారం పౌరులమధ్య, స్త్రీ పురుషుల మధ్య హక్కుల విషయంలో వివక్షత పాటించరాదు. కనుక ఈ బిల్లు మన సామాజిక వ్యవస్థలో ఒక విప్లవాత్మకమైన మార్పు అనక తప్పదు. ఇది ఆంధ్రులకే కాక అఖిలభారతావనిలో ఈ మార్పు పాటించాలి.

ఈ బిలు చట్టరూపం తాల్చినా వరకట్న సమస్య సమసిపోదు. కట్నం తీసుకోవటం అనేది మనస్తత్వంమీద ఆధారపడి వుంటుంది. ఆస్థివున్న పిల్లలకు ఆస్తి కాక ఇంకా ఏమి ఇస్తావని అడుగుతున్నారు. రెండువేలు సంపాదించే పిల్లకైనా, డాక్టరు, ఇంజనీరు పిల్లకైనా ముడుపు చెల్లించక తప్పదంలేదు. మగాడికి కట్నం హోదాగాను, ఆడపిల్లల తండ్రికి అది జరిమానాగానూ మారింది. మగా ఆడా తేడాలు వల్లే వరకట్న పిశాచం విజృంభించింది. కనుక ఈ బిల్లులు ఆడపిల్లల్ని రక్షించలేవు. కాని ఆస్తి హక్కు స్త్రీలకు చాలా అవసరం. ఆ హక్కు స్త్రీల వ్యక్తిత్వాన్ని రక్షిస్తుంది. మనం హక్కులను ఉపయోగించుకోవాలి. లేకపోతే అవి నశిస్తాయి. చట్టం అంటే అదొక కత్తిలాంటిది. వాడకపోతే అది తుప్పు పడుతుంది. ఏదైనా మన మానసికవైఖరి మారితేనే కట్నాలు పోతై. అప్పుడే ఈ బిల్లువల్ల స్త్రీలకు లాభం వుంటుంది.

ఈ బిల్లులో కొన్ని లోపాలున్నా ఆస్తి హక్కువల్ల స్త్రీకి కొంతరక్షణ, ఆత్మస్థయిర్యం, వ్యక్తివికాసం వస్తాయి. ఇలా సవరణలు చేయడంకన్నా పూర్తిగా స్త్రీల అస్తిహక్కుకు ప్రత్యేక చట్టం చేస్తే బాగుండేదేమో! 1956 చట్టం ఆస్తుల (Blending) కలగలుపు సూత్రాన్ని ఈ బిల్లు మార్చలేదు. అంటే ఎవరైనా సంపాదించి కుటుంబాస్తిలో కలిపితే మొత్తం "కోపార్సనరీ" ఆస్తి అవుతుంది. ఈ బిల్లువల్ల కుమార్తె కోపార్సనర్ అయి ఆమె ఆస్తి పుట్టింటి ఆస్తిలో కలిసి పోతుంది. కనుక కూతురి ఆస్తికి కలగలుపుసూత్రం వర్తించదని ఒక నిబంధన ఏర్పరచాలి. ఈ బిల్లు ప్రకటించిన తేది 18-3-83 నుండి ఒక సం॥ వెనుక నుండి అమల్లోకివచ్చినట్లు ఎంచుకొనే సవరణ చాలా అవసరం.★ లేనిచో చాలామంది ముందుగానే పంపిణీలు చేసుకున్నట్లు రుజువుచేస్తే కూతుళ్ళకు ఏ మాత్రం ఆస్తి రాదు.

ఒకే వ్యవహార సంహిత ఏర్పడేదాకా వేచి వుండేకన్నా ఇలాంటి విప్లవ లక్షణాలున్న బిల్లులు ఇతర రాష్ట్రాలలో రావాలి. అన్ని మతాల స్త్రీలకు కూడా వర్తించే లా శాసనాలు మార్చాలి.

★ఈ సవరణతో బిల్లు పాసయింది.

(ఆంధ్రపత్రికవారి ప్రథమ బహుమతి 2-8-83 న వెయ్యిరూపాయలు పొందిన వ్యాసం)

# మనది మనువు పుట్టిన దేశమే తల్లీ!

"భారతీయ సంస్కృతి చాలా ఉత్కృష్టమైనది, ఉన్నతమైనది, పవిత్రమైనది" అనే భావం ఈ నాటిదికాదు. 3 వేల సం॥ రాలుగా మన్ని వెంటాడుతున్న వారసత్వం. "ఈ గడ్డపై మనువులాంటి మహాపురుషుడు పుట్టబట్టే స్త్రీలు పతివ్రతలై ఉత్తమ గృహిణులుగా జీవిస్తున్నారు." అనేభావం ప్రబలంగావుంది. 'భర్త దుర్వినీతుడైనను వ్యభిచారియైనను, దుర్గుణుడైనను భార్య వానిని భగవంతునివలె పూజించవలెను.' (మను 5_154) జారుడైనా, దుర్జనుడైనా, 'శాడిస్టు' అయినా హిందూ స్త్రీకి పతియే దైవమని ఉగ్గుపాలతో రంగరించి పోసింది హిందూమతం. అంతటితో ఆగలేదు. భర్త చెప్పిన చెడుకార్యాన్ని సైతం శిరసావహించటం పతివ్రతా ధర్మమని, భర్త జారత్వాన్ని ఉపశమింపజేసిన సుమతి స్త్రీల కాదర్శమని, భర్త రుణబాధకై తానుఅమ్ముడుపోయిన చంద్రమతి ఉత్తమ సాధ్వియని బ్రహ్మాండమైన 'బ్రెయిన్‌వాష్' జరిగింది మన స్త్రీలకు. ధర్మశాస్త్రజ్ఞులు స్త్రీకి యావజ్జీవ పరాధీనతతోపాటు కఠిన నియమాలుకూడా నిర్దేశించారు. గృహ్యసూత్రాలు, ధర్మశాస్త్రాలు, స్మృతులు రచించిన స్మృతికర్తలంతా స్త్రీకి విధులుతప్ప హక్కులను ప్రతిపాదించనే లేదు. వారిలో ముఖ్యుడు మనువు. ఆ మను ధర్మశాస్త్ర నిర్వచనాలే సాంఘిక నియమాలై, హిందూమత సంప్రదాయాలై విశిష్ట స్థానాన్ని పొందినై. మతగ్రంథాలన్నీ స్త్రీని వ్యక్తిత్వంలేని ఆటబొమ్మగా చిత్రించాయి. ఈ పురుషాధిక్య సమాజంలో శాస్త్రాలు, చట్టాలు, సాంఘిక కట్టుబాట్లు అన్నీ పురుషులే తయారుచేశారు సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో స్త్రీలపై పురుషులు నిరంకుశంగా ఆధిపత్యం వహించారు. నిస్సహాయులైన స్త్రీలు బానిస మనస్తత్వంతో వాటిని ఆమోదించటం జరిగింది; ఇంకా జరుగుతోంది. తరతమ భేదాలతో ఇతర మతాలలోను, ప్రపంచం మొత్తంమీదను స్త్రీల పరిస్థితి ఒకలాగేవుంది. దీనికి బోలెడన్ని సాక్ష్యాధారాలున్నాయి.

అనురాగ బంధంచేత కట్టివేయబడిన ఇద్దరు వ్యక్తులుగా సతీపతులనూహించ లేదు హిందూ సమాజం. దాంపత్యమనే బండికి ఇద్దరూ రెండు చక్రాలని పైకి చెప్తున్నా ఆ బండికి ఒకే చక్రం తిరుగుతోంది అతడే పురుషుడు. స్త్రీయైన ఆ రెండోచక్రం తిరగదు. దాన్ని మొదటిచక్రం ఈడ్చుకెడుతుంది. ఇది జీవిత అనుభవం; కాదనలేని నచ్చినిజం.

భారతదేశంలో స్త్రీలను దేవతలగానో, బానిసలగానో తప్ప మనుష్యులుగా చూడలేరంటాడొక విమర్శకుడు. అది అక్షరాలా నిజం. అయితే మనం ఆ భావాన్ని కొంత మార్చి ఇలా చెప్పుకోవచ్చు. దేవతలుగా చూస్తున్నామంటూ బానిసలుగా చూస్తారిక్కడ స్త్రీలను. ఇక్కడ మనం గుర్తుంచుకోవాల్సిన విషయం మరొకటివుంది. ఏ తల్లి ఒడిలోనుండి పెరుగుతూ వచ్చారో, ఏ తల్లి భావాలతోనే పెరిగి పెద్దవాళ్ళవుతారో ఆ తల్లుల్ని అజ్ఞానంలో, అవమానంలో వుంచడంవల్ల ఆ నష్టం కేవలం ఆ తల్లులకే పరిమితంకాదు. మొత్తం సమాజమే నష్టపోతుందనేది నగ్నసత్యం. అసలు స్త్రీ ఎంతకాలం అజ్ఞానాంధకారంలో కొట్టుకొని వుంటారో అంతకాలం సమాజ ప్రగతి నిర్వీర్యమైపోతుంది. అభివృద్ధి కార్యక్రమాలు కుంటుపడతాయి. భావిపౌరుల భవిష్యత్తు శూన్యమవుతుంది. ముఖ్యంగా పురుషులు సైతం అర్ధబానిసత్వంలో పడి వుండక తప్పదు. అంతేకాదు పురుషుల స్వేచ్ఛకూడా మేడిపండులా వుంటుంది. కనుక స్త్రీల విముక్తి అంటే పురుషుల విముక్తేననే చేదునిజాన్ని విస్మరించరాదు. ఆఖరికి ఈ దృష్టితోనైనా ఆలోచించి తమ సంకెళ్ళను త్రెంచుకొనే ప్రయత్నం అవశ్య కర్తవ్యంగా పురుషులు భావించాలి.

అమ్మాయి పుట్టింది మొదలు అన్నీ సమస్యలే. అసలు సమస్యలనేవి కేవలం ఆడవాళ్ళకో, మగవారికో మాత్రం పరిమితమైనవి కావు. ఒక ప్రత్యేకమైన దేశానికో, కాలానికో మాత్రమే పరిమితమైనవి అంతకన్నా కావు. వివేకం విజ్ఞానం కలవాళ్ళు ఆ సమస్యల్ని ఎప్పటికప్పుడు ఎదుర్కొంటూ పరిష్కరించుకోగలుగుతారు. కాని అనేక కారణాలవల్ల స్త్రీల సమస్యలు చాలా సున్నితమైనవిగానూ, పరిష్కరించుకోటానికి చాలా క్లిష్టమైనవిగాను, చిక్కుపడిన దారపు ముడిలా వుంటాయి. ఆ చిక్కు ముడి విప్పటానికి ఎంతో మెలకువ, నేర్పు, ఓర్పు వుండాలి. అంతేకాదు అసలు స్త్రీలకు సమస్యలే లేనట్లు పైకి కనపడుతూ అవి అంతర్వాహినిలా, నిగూఢంగా ప్రవహిస్తూ వుంటాయి. అందుకే తమ దాస్యానికి తామే ముగ్ధులైన స్త్రీలు "మాకేం మేము సర్వసౌఖ్యాలు అనుభవిస్తున్నాం; బిడ్డా పాపలతో 'ఉత్తమ గృహిణి'గా జీవిస్తూ వున్నాం" అంటున్నారు. అజ్ఞానులైన కొందరు గృహిణులు, విద్యావంతులు సైతం తరతరాలుగా తాము తక్కువవారమని, అణగిపడివుండాలి అనే భావదాస్యానికి అంకితమైపోయ్యారు. పురుషాధిపత్యానికి అలవాటుపడ్డ మహిళలు తమకేమి కావాలో, తామేమీ చెయ్యాలో తెలియని అజ్ఞానదశలో పడి కొట్టు మిట్టాడుతున్నారు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక రంగాల్లో రెండవతరగతి పౌరులుగా చలామణి అవుతున్నారు. ఆజన్మాంతం ఆధారపడి బ్రతికే 'పేరాసైట్సు' గా జీవితాన్ని వెళ్ళబుచ్చుకుంటున్నారు. ఇంటా, బైటా, రెండోబెంచికే కేటాయించబడుతున్నారు.

చాకిరీచేస్తూ చేతులు బొస్తున్నారు. సంపాదిస్తున్నా అణిగి అణిగి మణిగి బ్రతుకటమే ధ్యేయంగా పెట్టుకున్నారు. అయినా వారికి ఉనికిలేదు. వారి ప్రాణానికి భద్రతలేదు. తమ కట్నంతో కొన్న భర్తకే తాము దాస్యానికి అర్హత సంపాదిస్తున్నారు. హత్యలు, ఆత్మహత్యలు, సజీవదహనాలు స్త్రీలపై దరహాస నాట్యాలు చేస్తున్నాయి. జీవచ్ఛవాల్లా జీవించే స్త్రీల సంఖ్యలో మార్పులేదు. అయినా అదంతా న్యాయమేనని, పురుషులు అధికులేనని నమ్ముతున్నారు నాటిస్త్రీలు, నేటిస్త్రీలుకూడా. ఇది ఈనాటి స్త్రీజాతి కథ.

జరిగిపోయిన దానికి ఎవరో ఒకరిని తప్పుపడుతూ కూర్చోవటం విజ్ఞతకు లక్షణంకాదు; ఇతరులను నిందిస్తూ, తమ లోపాలకు చింతిస్తూ వుంటే ప్రయోజనం లేకపోగా భవిష్యత్తు శూన్యమవుతుంది. అందువల్ల అవమానం పొందుతున్న వాళ్ళే అవమానాన్ని ఎదిరించాలి. సమానహక్కులు కావాలి, కావాలి అని కేవలం వాదించడమేకాక మనంకూడా సంఘంలో ఒక భాగమేనని భావించాలి. మనకూ సంఘనిర్మాణంలో ఒక బాధ్యత వుంది అనే ఆత్మవిశ్వాసంకూడా అలవర్చుకోవాలి. స్త్రీలు విజ్ఞానంతో మానసిక వికాసంపొంది ఆత్మగౌరవంతో మెలగాలి. స్వేచ్ఛ, సమానహక్కులు ఒకరు మరొకరికి ఇచ్చేవికావు; చెయ్యిచాపి పుచ్చుకొనేవి అంతకన్నా కావు.

నేడు స్త్రీలు అనుభవిస్తున్న ఈ అసమానతకు, అపమానాలకుకారణం అజ్ఞానం, అవివేకం, భావదాస్యం, మౌఢ్యాలే అనకతప్పదు. ఇదికేవలం ఒక్క స్త్రీలలోనేకాదు మొత్తం సమాజంలోనే పాతుకుపోయిన అజ్ఞాన లక్షణం. ఈ అజ్ఞానంనుండి విముక్తి పొందటానికి మార్గం మనం విజ్ఞానవంతులం కావడమే. సాంఘికంగా అవమాన కరమైన స్థితిలోవున్నవాళ్ళు ఎవరైనా చేయాల్సిందిఇదే. ఇది చెప్పుకోటానికైతే చాలా తేలిగ్గా వుంటుంది కాని మూడువేల సం॥ రాలనుండి మనలో జీర్ణించిపోయిన సనాతనాచారాలు, మూఢవిశ్వాసాలు మన్ని ఓ పట్టాన విడిచిపోలేవు. విద్యావంతులైన స్త్రీలు, ఉద్యోగినులైన స్త్రీలు ఎంతమంది మానసిక దాస్యవిముక్తి పొందుతున్నారో ఆలోచిస్తే మనకే అర్థమవుతుంది. కనుక విద్యా, ఆర్థిక ప్రతిపత్తి మాత్రమే స్త్రీల సమస్యల్ని తీర్చలేవు. మనలో భావవిప్లవం కలగాలి, జాగృతితో కూడిన వికాసం మన్ని మేల్కొల్పాలి. అలా విముక్తులైన స్త్రీ పురుషులు మాత్రమే తోటి స్త్రీ జాతిలో జాగృతి, మార్పు కలిగించగలరు. అలా కానప్పుడు ఈ సమస్య ఇంకా జటిలమై, ప్రమాదానికి దారితీసే అవకాశం లేకపోలేదు.

వ్యక్తి తన జీవితాన్ని సుఖవంతం చేసుకోటానికి తపిస్తాడు. ఆ లక్ష్య సాధనకై మార్గాన్వేషణాపరుడవుతాడు. అయితే ఆ సుఖం అనే దానికి అర్థం

మాత్రం ఆవ్యక్తుల దృక్పథాలనుబట్టి వుంటుంది. అసలు జీవితంలో ఏ మాత్రం స్వేచ్ఛలేకుండా సుఖపడటం అనేదానికి అర్థంలేదు. అలాగే జీవితసమస్యలు, విలువల పట్ల ఏ మాత్రం అవగాహన లేకుండా సుఖపడుతున్నాం అనుకోవడం వట్టిభ్రమే. ఈనాటి భారత సమాజంలోని మహిళలు ఇలాంటి భ్రమల్లోనే జీవిస్తున్నారు. ఆ భ్రమ అనే ఊబినుండి ఏ ఒక్కరినీ మరొక్కరు బైటికి లాగలేరు. అలా లాగినందువల్ల ఈ సమస్య మరింత గందరగోళం అవుతుంది కనుక తమకు తామే సమస్యలను పరిష్కరించుకోగల వివేకాన్ని స్త్రీలు పొందగలగాలి. అది చాలా బాధ్యతతోను, నిజాయితీతోనూ చేయాల్సినపని. అలా జరిగిననాడే మనలో మార్పు వస్తుంది. మన సమస్యలన్నీ పటాపంచలయి పోతాయి. ఆనాడే మన హక్కులను, కర్తవ్యాలను సైతం విస్మరించలేము. ఆనాడే సమసమాజ ఆవిర్భావం, సాంఘిక పురోభివృద్ధి, రాజకీయ దక్షతలకు స్త్రీలు మార్గదర్శకులవుతారు. దానికి తగిన విద్య, వివేకం, భావవిప్లవం, ఆధునికత, సామాజిక అవగాహన స్త్రీలలో ద్విగుణీకృతం కావాలి. ఆ సాధనకై సర్వులం ప్రయత్నిద్దాం.



బంగారు సంకెళ్ళు

# క్రైస్తవంలో స్త్రీల బానిసత్వం

స్త్రీ చేసిన తప్పిదం వల్లనే ఈ ప్రపంచంలోని చెడంతా పుట్టిందని బైబిలు నిర్వచించింది. కనుకనే క్రైస్తవ మతస్థులు స్త్రీలను వేటాడిన కథలుచెబితే తీరేవికావు. ఏ మతమూ, ఏనాడూ, ఏ దేశంలోనూ స్త్రీని వ్యక్తిగా సమాన ప్రతిపత్తి నిస్తూగౌరవించనేలేదు. ఇక క్రైస్తవమత చరిత్ర పరిశీలిస్తే స్త్రీల దైన్యావస్థ వర్ణనాతీతం. 585 A. D. లో 59 మంది బిషప్పులు మేకన్ (MACON) లో అసలు స్త్రీకి 'ఆత్మ' వున్నదా? అని చర్చించి చివరకి అతికొద్ది మెజారిటీతో వున్నదని ఒప్పుకున్నారట! అలాగే గ్రీకు చర్చిలో చాలాకాలం తరువాతకాని స్త్రీని వ్యక్తిత్వమున్న మనిషిగానే గుర్తించలేదని చరిత్రలోవుంది. రష్యాలో జనాభాలెక్కలు వ్రాసేటప్పుడు పురుషులను మాత్రమే లెక్కతీసుకున్నారు కాని స్త్రీలను చేర్చనేలేదు. 1854 లో ఫిలడల్ఫియాలో స్త్రీలహక్కుల మహాసభలో (ఉమెన్సు రైట్సు కన్వెన్షన్) "స్త్రీలకు ఆత్మలున్నాయని రుజువు చెయ్యాలి" అని సవాల్ చేస్తూ, కొందరు అరుస్తూ సభలో అల్లరిచేసి సభను చెల్లాచెదరు చేశారు. ఇంగ్లండులో, అమెరికాలో స్త్రీలను పశువులలాగా అయిదు డాలర్లనుండి అయిదు వేల డాలర్లవరకూ అమ్మకం జరిగింది. అలాగే కోపర్నికస్ సిద్ధాంతాన్ని గణిత శాస్త్రరీత్యా సమర్ధించిన కెప్లరును కన్నందుకు ఆయనతల్లి ఒక కర్ణపిశాచి అయి వుంటుందని మతస్థులు ఆమెను బందీచేశారు. ఇలా కర్ణపిశాచులనే మిషతో క్రైస్తవమతం షుమారు కొన్నివేలమంది స్త్రీలను పొట్టన పెట్టుకున్నట్లు చరిత్ర కారులు అంచనా కట్టారు. ఇంకా మతేతరుల కన్యలను మండుతున్న పీటాలపై కూర్చోపెట్టినట్లు దాఖలాలువున్నాయి. ఇలాంటి అత్యాచారాలు స్త్రీలపై 5, 6 శతాబ్దాలలో జరిపినట్లు చరిత్ర రుజువుచేస్తోంది. బైబిలు స్త్రీనిగురించి ఎలా ఆలోచించిందో తెలియాలంటే బైబిలు చదవాలి. ప్రతిచోటా ఆమెను పురుషుని ఆస్తిగా పరిగణించడం జరిగింది. ఏ క్షణానైనా కోపంవస్తే త్యాగపత్రంరాసి ఇస్తాడుభర్త. అప్పుడామె అతని పిల్లలతల్లి – ఇల్లులేనిది, కుటుంబంలేనిది అవుతుంది.

క్రైస్తవమతంలో స్త్రీలగురించి వివిధ అభిప్రాయాలు, నిర్వచనాలు వివరిస్తుంటే హృదయ విదారకంగా వుంటాయి. "నేను పెళ్ళాడతలిస్తే రాతిలోంచి

విధేయతకల స్త్రీని సృష్టిస్తా. ఎందుకంటే స్త్రీలలో విధేయత వుంటుందనే ఆశ నాకులేదు." అన్నాడు ప్రొటెస్టెంటు మతనిర్మాత సెయింట్ లూథర్. అలాగే అగస్టుకామ్ "స్త్రీత్వం అంటే కొనసాగుతూన్న శైశవమే" (బుద్ధి పెరగదని శాపం) అన్నాడు. క్రైస్తవభర్తకు భార్య సాంగత్యాన్ని కోరేహక్కు ఎప్పుడుపడితే అప్పుడున్నదన్నాడు మేటిస్టోప్స్.

బైబిలు పాతనిబంధన పది ఆజ్ఞల (**Ten Commandments**) లో పదవ ఆజ్ఞలో స్త్రీలను పరిచారికలతో, పెంపుడు జంతువులతో సమానంగా నిర్దేశించారు. స్త్రీని పురుషుడి ఆస్తిగా - ఎద్దులు, గాడిదలు, ఇల్లు, పొలంతో సమానమని చెప్పారు. క్రీస్తు బ్రహ్మచారి; పెళ్ళి అంటేనే అతనికి అసహ్యం. "కొంతమంది జన్మతో నపుంసకులు, మనుష్యులవల్ల నపుంసకులయ్యేవారు కొందరుకాక స్వర్గరాజ్యంకోసం నపుంసకులుగా కొందరు కావా"లని చెప్పాడు క్రీస్తు. కేనాలో క్రీస్తుతల్లి వివాహపు విందు సందర్భంగా సహాయం అడిగితే "మహిళా! నీతోనాకేంపని" అన్నాడు. క్రీస్తుమతాన్ని యూదు జాతీయతనుండి వెలికితీసి వ్యాప్తికి తోడ్పడిన పాల్ "స్త్రీని స్పృశించకుండుట పురుషునికి శ్రేయస్సు" అన్నాడు ఇంకా "కన్యకు పెళ్ళిచేయనివాడు శ్రేష్టుడు." అనికూడాపాల్ చెప్పాడు. పాల్ బ్రహ్మచారిగా ఉన్నాడు. క్రీస్తుకు చెందినవారు కామవాంఛలు, అభిమానాలతోసహా శరీరాన్ని కృశింపజేయాలన్నాడు. శరీరాన్ని ద్వేషించటమంటే స్త్రీని ద్వేషించటమని పాల్ భావం. అంటే పురుషుని పతనానికి కారణం స్త్రీ. (యాపిల్‌పండు తినిపించటంవల్ల నరకంలో పడ్డారనిభావం) "ప్రపంచంలోకి ఆమెవల్లనే పాపం ప్రవేశించింది. ఆమె అపరిశుద్ధ. కనుక దూరంగా వుంచుము" అలా బోధచేశాడు పాల్.

"ఓ మహిళా! నీవు దుఃఖిస్తూ పిచ్చిదానిలా తిరగాలి. నీవు మానవాళి వినాశానికి కారణభూతం. నిన్ను పురుషులు మరిచి పోయ్యేలా నీవు సంచరించాలి. నీవు నరక ద్వారానివి." అన్నాడు టెర్‌ట్యూలియస్. అసలు వివాహమే దుష్టమైనదన్నాడు జరోమ్. దాన్ని పరిశుద్ధం చేయడం మనవిధి అనికూడా చెప్పాడు. అందుకనే క్రైస్తవులు వివాహాన్ని పవిత్రమత తంతుతో పూర్తిచేస్తారు. పెళ్ళి అపరిశుద్ధమూ, అపవిత్రమూ, కేవలం కామవాంఛ తీర్చుకోటానికే అది సాధనమంటూ తన మర్మావయవాన్ని కోసుకున్నాడు ఓరిగన్. "మానవజాతి నశించినాసరే బ్రహ్మచర్యాన్ని పాటించాలి" అన్నాడు టెర్‌ట్యూలియన్. "బ్రహ్మచర్యం పాటించేవారు స్వర్గంలో మణుల్లా ప్రకాశిస్తారు. వారి తల్లిదండ్రులు కాంతిలేని నక్షత్రాలుగా

వుంటారని చెప్పాడు ఆగస్టిన్. "భర్తకు మీరు విధేయులుగా ఉండండి"అని భార్యలను హెచ్చరించాడు పీటర్. ప్రతిపురుషుడికి, చర్చికి క్రీస్తు ఏలా యజమానియో, భర్త భార్యకు అలా యజమాని. స్త్రీ లొంగివుండి మూగగా విద్య గడించాలి. స్త్రీ ఉపాధ్యాయిని కావటంగాని, దురాక్రమణద్వారా భర్తమీద అధికారాన్ని చలాయించడంగాని నేను అంగీకరించను అన్నాడు పాల్. ఈ భావాలు క్రైస్తవానికే పరిమితంకాదు. యూదుమతంలో, గ్రీసుదేశంలో, ఈజిప్టు, బెబిలిన్, ఇండియాలో కూడా వుండేవి. ఇప్పటికీ అమల్లో లేకపోలేదు.

లైంగిక వాంఛల విషయంలో స్త్రీ పురుషుడికి లోబడి వుండేది. ఉష్ణ దేశాలలో లైంగిక ప్రేరణజాస్తి. అందువల్ల తూర్పురాజ్యాలలో వ్యభిచారవృత్తి నెలకొల్పబడినట్లు పాతనిబంధనలోవుంది. అబ్రహాం తన భార్య సారాను ఇతరులకు అద్దెకిచ్చినట్లు; దావీదు సలోమాన్ల అంతఃపురంలో అనేకమంది స్త్రీలుండేవారని కూడావ్రాసివుంది. క్రి.పూ. 594 లో సలోర్ ప్రభుత్వ వ్యభిచారగృహాలను నడిపాడు. క్రీ.పూ. 400 లో కోరింత్ దేశంలో 'అఫ్రోనైట్' దేవతగుడిలో వెయ్యిమంది వ్యభిచారిణులు ఉండేవారు. సమాజంలో గొప్ప పలుకుబడిగలవారు వీరివద్దకు వస్తూపోతూ వుండేవారు. పవిత్రస్త్రీలు, వివాహితలు ముసుగులేనిదే బైటికి వచ్చేవారుకాదు. "సక్రమ సంతానంకోసం, గృహ పరిరక్షణకోసం మనం పెళ్ళిచేసుకున్నాం. ప్రతిరోజూ మనకు సేవచేసే నిమిత్తం ఉంపుడుగత్తెలను ఏర్పాటుచేసుకుంటాం. ప్రేమ, ఆనందం అందించే సంతోషంకోసం మనం ఉంపుడు గత్తెల దగ్గరికిపోదాం." అని ఏథెన్సునగరంలో లైంగిక సంబంధాలగురించి డెమాస్తనీస్ అనేవ్యక్తి చెప్పాడు. ఈ వ్యభిచారిణులు 'ఎహైరా' అనే దేవత సేవ చేసేవారు. స్త్రీలతో సంపర్కం తగదని అరిస్టాటిల్ బోధించాడు, కారణం గ్రీకునగరాలు చాలాచిన్నవి. జనం పెరిగితే తమహోదా తగ్గుతుందని. ప్లేటో నగరస్త్రీలందరిని ఉమ్మడిగా వుంచి అందులో తెలివి అందం కలవారిని ఎన్నుకొని ఉత్తములను కనమని ఆదేశించాడు.

రోమన్ సామ్రాజ్యంలో భర్త భార్యకు గార్డియన్‌గావుండేవాడు. విడాకుల హక్కు పురుషులకే వుండేది. రోమ్‌నగరం ధనవంతమైన కొద్దీ వ్యభిచారగృహాలు బాగాపెరిగాయి. బ్రహ్మచర్య భోగవల్ల వివాహాలసంఖ్య తగ్గింది. క్రి.పూ. 16వ సం॥లో అగస్టస్ అనేరాజు బ్రహ్మచారులను శిక్షించమని ఒకశాసనం చేశాడు. ఇంకా పిల్లలులేని తల్లిదండ్రులకు వారసత్వపు ఆస్తిని సగానికి తగ్గిస్తూ శాసనం

పెట్టాడు. అప్పుడు ప్లూటార్క్ అన్నట్లు రోమనులు వారసులకోసం కాకుండా వారసత్వంకోసం వివాహాలాచటం మొదలుపెట్టారు. స్త్రీ పురుషునితో ఒక యేడాది కాపురంచేసినా, ఒకర్ని ఒకరు డబ్బిచ్చి కొనుక్కున్నా, పదిమంది సాక్షులఎదుట మతగురువు వివాహం చేసినా ఈ మూడురకాల పెళ్ళి చెల్లుతుంది రోమనులకు. యూదుల్లో తండ్రి నియమించిన వరుని కూతురు విధిగా వివాహమాడాలి. వివాహానికి మతతంతుముఖ్యం. ఒకవంక సాధువులసంఖ్య, మరొకవైపు వ్యభిచారం పెరిగిన పరిస్థితుల్లో క్రైస్తవం వచ్చింది. ఆనాడు స్త్రీలు క్రైస్తవాన్ని స్వీకరించారు; పోరాటాల్లో పాల్గొన్నారు, త్యాగాలు చేశారు, మరణాలపాలయ్యారు. అనేకమంది రాజులను క్రైస్తవంలోకి మార్చటానికి స్త్రీలు శ్రమపడ్డారు. హంగేరిలో, కాంట్(Cant )లో రాణులు మతాన్ని స్వీకరించారు. కాని క్రైస్తవం స్త్రీలకేమిచ్చింది? పురుషులకు బానిసలను చేసింది. ఇప్పటికీ పెళ్ళిళ్ళలో వధువుచేత నీకు విధేయురాలిగా వుంటానని ప్రమాణం చేయిస్తారు.

జమీందార్లు తమకు అర్ధబానిసలుగావున్న వారి వివాహాలు వారే నిర్ణయించే వారు. అంతేకాక మొదటిరాత్రి అనుభవించేవారు. ఆ పిల్లను తెచ్చుకోటానికి వరుడు జమిందారుకు డబ్బుకట్టేవారు. మఠాలు వ్యభిచార నిలయాలయినాయి. మత గురువులు ప్రజాకంటకులయినారు. ఉంపుడుకత్తె లేని మతగురువును ఇళ్ళకు పిలిచేవారుకారు. కారణం కుటుంబస్త్రీలను చెడగొడతారని భయం. కాన్స్టెన్సు ప్రాంత బిషప్పు ఉంపుడుకత్తెపన్నుకూడా వేశాడు. ఇదంతా మధ్యయుగపు సమాజ ప్రత్యేక లక్షణం. స్త్రీలు సైన్యంలో పనులుచేస్తూ పురుషసైనికుల అవసరాలు తీర్చేవారు. రాజుకు చెందినా, చర్చికి చెందినా, మున్సిపాలిటీలకు చెందినా వ్యభిచారగృహాలు విరివిగా వుండేవి. లైసెన్సు లేని గృహా వ్యభిచారుల్ని బాగా శిక్షించేవారు. 13, 14 శతాబ్దంవరకూ జమీందార్ల బిడ్డలు విచ్చలవిడిగా మానభంగాలు చేస్తూ స్వైరవిహారం చేసేవారు. ఒకవైపు మతగురువుల విషయ లోలత్వం, మరొకవైపు శరీరాన్ని కృశింపచేసే సిద్ధాంతప్రచారం జరుగుతూవుండేది. స్త్రీలు తమకు ఏ విధమైన హక్కులు లేనట్లే ఎంచుకునేవారు. బానిసలు స్వేచ్ఛను వద్దని ఎలా ఎలుగెత్తి అరిచారో అలాగే స్త్రీలు స్వేచ్ఛను కోరనేలేదు.

రోమన్ కేథలిక్కు మత గురువుగావుండి కష్టాలనుభవించిన లూథర్ ప్రొటెస్టెంటు మతాన్ని స్థాపించాడు. లైంగిక ప్రేరణ ప్రకృతి సహజమైనదని లూథరు భావన. భార్యలుగావున్నస్త్రీలు ప్రొటెస్టెంటు మతాన్ని స్వీకరించారు, కాని వారికి లాభించిందేమీలేదు.

కేథలిక్ మతగురువులు తాము అపవిత్ర జీవితం గడుపుతున్నందున స్త్రీల ప్రవర్తనను చూచీ చూడనట్లు ఊరుకున్నారు. ప్రొటెస్టెంటు మతం మతగురువులను పెళ్ళి చేసుకోనిచ్చింది. కానీ, వ్యభిచారాన్ని విపరీతంగా శిక్షించింది. రిఫర్మేషన్ అంటే అతి పవిత్రతాభావం ప్రొటెస్టెంటు మత స్థాపనవల్ల వెలిసింది. అంతకుముందు స్త్రీలు జాతర్లలో పాల్గొనేవారు. ప్రొటెస్టెంటు మతం వచ్చాక అవి ఆగిపోయాయి. జనాభా పెరుగుతుందనే భయంవల్ల, బ్రహ్మచర్య ప్రచారంవల్ల పెళ్ళిళ్ళ సంఖ్య తగ్గింది. అందువల్ల అక్రమ సంతానం పెరగటం మొదలయింది.

" స్త్రీ పురుషులు కలిసి సంపూర్ణత్వం సాధిస్తారు. ఒక లైంగికజాతి మరో లైంగిక జాతిని పూర్తి చేస్తుంది " అన్నాడు జర్మన్ ఫిలాసఫర్ కాంట్ (KANT). "బ్రతకాలనే సంకల్పానికి బహిర్గత ప్రకటనే లైంగిక ప్రేరణ " అన్నాడు షోపెన్‌హర్ అనే జర్మన్ ఫిలాసఫర్. " ఇచ్ఛయొక్క ఏకాగ్రతే లైంగిక ప్రేరణ " అని జాన్‌మూవార్టు అంటే, " శాసనం అంగీకరించిన, అనుభవంలోకి వచ్చిన బానిసత్వం ఈ నాటి వివాహం." అన్నాడు మిల్. లైంగిక సంభోగమే కాక మేధోయుతమైన సన్నిహితత్వం దంపతులు కోరుకుంటారని క్రైస్తవంగాని, ఇతర మతాలు కాని చెప్పనేలేదు.

'పోప్' నుండి అనుమతి వుంటే తప్ప విడాకులకు అవకాశం లేదు పెళ్ళాడేటప్పుడు ఈ దాంపత్యం నిలుస్తుందా, లేదా, అని మతగురువు ఆలోచించడు. వధువుకి 20 సం॥ వుండి, వరుడుకి 70 సం॥ వున్నా పట్టించుకోడు. కాని పెళ్ళి అయ్యాక ఆ బంధం చెడిపోవటానికి అంగీకరించడు. ఇలాంటి వివాహం స్త్రీకి బానిసత్వం కాక మరేమిటి ?

" ఏ జాతి చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం " అన్నట్లు సామాజిక నీతిని నిర్దేశించే మతం స్త్రీ పురుషుల సంబంధాన్ని, స్త్రీ హోదాను, ఆమె పాత్రను విస్మరించలేదు. క్రైస్తవం ఒకనాటిది కాదు. దానికి మూడువేలయేళ్ళ చరిత్ర వుంది. పాత నిబంధనలోని వ్యవస్థ క్రొత్త నిబంధనలో లేదు. ఆ మాటకొస్తే పాత నిబంధన అంతా ఒకనాటి చరిత్ర కాదు. అది యూదు జాతీయుల పూర్వ చరిత్ర. కనుక 'పవిత్ర' గ్రంథమైన బైబిలులో స్త్రీ యెడ వైఖరి మారుతూ వచ్చింది. మొత్తం మీద స్త్రీలను హింసించడమూ, అణచి వేయటం, సొంత ఆస్తిగా చూడటం, బానిసగా, సేవకురాలిగా చూడటం, అవమానించటం లాంటివి నాటికీనేటికీ విధానంలో తేడాలున్నా మౌలికంగా మారలేదనే దానికి నిదర్శనాలు చాలా వున్నాయి. *

# నేటి మహిళల దృక్పథం మారుతోందా?

ఇది విలువల విప్లవమా అన్నట్లు ఈనాడు మనం పరమాణు యుగంలో పయనిస్తున్నాం ఆధునిక యుగంలో జీవిస్తున్నాం. నేటి స్త్రీకి రాజ్యాంగం సమానత్వాన్ని ప్రసాదించింది. శాసనరీత్యా సమాన హక్కులు లభించాయి. పుట్టుకతో ఆస్తిహక్కు రాబోతుంది. ఇష్టంలేని భర్తతో కాపురం చెయ్యను అనే హక్కు గల తీర్పు వచ్చింది. వైస్‌ఛాన్సలర్లగా, జడ్జీలుగా మహిళలను నియమిస్తున్నారు. మహిళా విశ్వవిద్యాలయాలు స్థాపిస్తున్నారు. నూటికి ముప్ఫై ఉద్యోగాలను స్త్రీలకు కేటాయించాలనే నిర్ణయం జరిగింది. స్త్రీకి ఉద్యోగావకాశాలు పెరుగుతున్నాయి. ఆటల్లో, పాటల్లో బంగారు పతకాలు గెల్చుకుంటున్నారు. వివిధ రంగాలలో వేల సంఖ్యలో స్త్రీలు పాల్గొంటున్నారు. ఇదంతా స్త్రీల మనుగడకే గొప్ప మార్పు తెచ్చిందనీ, స్త్రీ పురుషులలో తేడాలు, హెచ్చు తగ్గులు లేవనేభావం ప్రబలంగా వుంది. అయితే ఇదంతా మహిళాభ్యుదయమా? మహిళల దృక్పథంలో మార్పువుందా? అని ప్రశ్నిస్తే ఒక దృష్టితో చూస్తే అవుననవచ్చు, మరో దృష్టితో ఆలోచిస్తే కాదని చెప్పుకోవచ్చు. అంటే మౌలికంగా మారలేదు. రూపంలో మారింది. సైంటిఫిక్‌గాను, నాగరికతగానూ మార్పువుంది. కాని భావాలలోనూ, సాంస్కృతికంగాను మార్పు లేదనేది నగ్న సత్యం. కనుక మారలేదనే దానికి చర్చ అవసరం అవుతుంది.

విజ్ఞానాభివృద్ధివల్ల మన నాగరికత ఆధునిక విధానాలల్లో పయనిస్తోంది. ఒకనాడు ఎద్దులబండిలో ప్రయాణం చేసిన మనం ఈనాడు కార్లలో, విమానాల్లో తిరుగుతున్నాం. ఏ. సీ లు ఎలెక్ట్రానిక్ పరికరాలు వాడుతున్నాం ఇది గణనీయమే, కాని సాంస్కృతికపరంగా ఆలోచిస్తే మానవ విలువలు, ఉద్వేగాలు, లక్షణాలు, ఆచార వ్యవహారాలు మారలేదని చెప్పటం సాహసంకాదు. ఆ గీటురాయితో తూకం వేస్తే నేటి భారత స్త్రీ హోదాక్లబ్బులో, వేషభాషల్లో, విద్యా ఉద్యోగనిర్వాహణాల్లో కొంత మార్పు వచ్చింది. అంటే స్త్రీ స్థానం బానిసత్వం నుండి 'షోకేస్' లోని బొమ్మ స్థితికి మారింది. అది నేటి మన నాగరికత ప్రభావచిహ్నమని చెప్పుకోవచ్చు. సాంస్కృతికంగా అంటే భావాల విషయంలో పాతని పొగుడుకుంటూ, పాతకాలంలో జీవిస్తూ మన సంస్కృతిని మించింది. ప్రపంచములోనే లేదని డంబాలు చెప్పుకోవటం పరిపాటి అయింది. దీనికి నిదర్శనాలేమిటి? అని ప్రశ్నిస్తే ఉదాహరణలు కోకొల్లలుగా వున్నాయి.

వివాహంలో కన్యను దానం చేస్తాడు తండ్రి. అంటే ఆడపిల్లమీద తనకుండే అధికారాన్ని అల్లుడికి ధారాదత్తం చేస్తాడన్నమాట. ఈ పెళ్ళితో కన్యమీద తండ్రికుండే ఆధిపత్యం భర్తకు సంక్రమిస్తోందన్నమాట. ఆ భావం వుండబట్టే తానెక్కడుంటే అక్కడికి కాపురానికి రావాలనే పిటీషన్ పెట్టే హక్కుకు అస్కారం కలిగింది భర్తకు. ఇక శిశువును కనేది, పెంచేదీ తల్లి అయినా బిడ్డమీద గార్డియన్ భర్త అవుతాడు. ఆడపిల్ల పుట్టుకనుండి ఆడా, మగా అనే తేడాలతో పెంచబడుతుంది. భార్య పెద్ద ఆఫీసరయినా; భర్తకన్నా పెద్దజీతం తెస్తున్నా ఇంటికొచ్చాక బండెడు చాకిరీ ఆమె మాత్రమే చెయ్యాలి. ఆమె ఇంటిపని, పిల్లలపని, ఉద్యోగ నిర్వహణలతో సతమతమై పోతుంది. అంతేకాదు ఆమె సంపాదనపై, ఆమె అస్తిపై భర్తకో, తండ్రికో, లేక ఏ అన్నదమ్ములకో హక్కు వుంటుంది. ఆడది మొగుడుని డబ్బు పెట్టి కొనుక్కోవలసిన స్థితిలో వుందంటే మన స్త్రీల పరిస్థితి ఎంత దయనీయమో ఆలోచిస్తారా? వివాహం జరిగేది కన్యల మనుస్సులకూ, మమతకూ కానే కాదు. కట్నాలకు, కులాలకు, వంశానికి, అంతస్తుకూ మాత్రమేనని రూఢిగా చెప్పుకోవచ్చు. అసలు ఆడదంటే ఇలా బట్టకట్టుకోవాలి; అలా బొట్టుపెట్టుకోవాలి; తలుపుచాటునుండి తలవంచి సమాధానం చెప్పాలి. ఆమె అబల, అజ్ఞాని, అణగి మణగి వుండాలి అనే సిద్ధాంతాలు బోలెడన్ని వున్నాయి. అలాగే వారి పనులు కూడా అనేక హద్దులకు, పరిమితులకు లోనై వేరుగా వుంటాయి. పైగా భర్త ఆజ్ఞలను తలదాల్చి ఎంతైనా నేను ఆడదాన్ని కదా! కడివెడు గుమ్మడికాయ అయినా కత్తిపీటకు లోకువే గదా! అనే సామెతలు చెప్పుకుంటూ; ఆడదై పుట్టాక బిడ్డల్ని పెంచక, ఇంటిపని చెయ్యక, భర్తను తృప్తిపరచక తప్పుతుందా? అది స్త్రీల ప్రథమ కర్తవ్యంకాదా? అని తమకు తామె నచ్చచెప్పుకుంటారు. దీనినే ఇంగ్లీషులో "ఇంటర్నలైజేషన్" అంటారు. అంటే ఈ పురుషాధిక్యత విలువలు, సమాజం నిర్ణయించిన అభిప్రాయాలు, ప్రాచీన సంప్రదాయాలు, ఆచారాలు ఇవన్నీ తమవిగా చెప్పుకొని, సమర్ధించుకొని ఆ చిలుక పలుకులు వల్లె వేస్తోంది నారీలోకం.

ముఖ్యమైన విద్య, ఉద్యోగం, వివాహం, హోదాలాంటి విషయాలలో స్త్రీల దృక్పథం మారిందా లేదా అనేదే మనకు గీటురాళ్ళు. నేటి స్త్రీ విద్య 20 శాతానికి పెరిగింది. ఇది ముదవహమే. కాని విద్య ఎందుకు? జ్ఞాన సముపార్జనకా? కట్నం తగ్గుతుందనా? మంచి భర్తలభిస్తాడనా? పెళ్ళయ్యేదాకా చదివిద్దామనా? అనేవి ఆలోచనాంశాలు. మౌలిక దృష్టితోచూస్తే అలాంటి మార్పు దృగ్గోచరమగుటలేదు. అలాగే ఉద్యోగ విషయంలోనూ - ఇది వ్యక్తి వికాసానికా? లేక వృత్తిలో నైపుణ్యానికా?

కుటుంబ నిర్వహణలో తన బాధ్యత నెరవేర్చుకునేందుకా? అంటే భార్యల విద్య ఉద్యోగాలు పూర్తిగా భర్తల ఆజ్ఞలపై, ఇష్టాఇష్టాలపై ఆధారపడి వుంటాయనే చేదునిజాలు మనకు తెలియనవి కావు. వివాహ ఎన్నికలలో కూడా పురుషుడిదే పైచేయి. కట్నం ఇవ్వటం తమ ఆత్మగౌరవ లోపమనీ, వ్యక్తిత్వానికి దెబ్బఅనీ, అలాంటి భర్తలు తమకొద్దు అనీ, అవసరంవస్తే కన్యలగానైనా జీవిస్తామనే ఆడపడుచులున్నారా? ఆలోచించండి.

పురుషుడికి లోకువగావుండి తన నిర్ణయాలకు కట్టుబడి, ప్రతిదానికి తనకోసం ఎదురు చూసే భార్య కావాలి. అందుకే తనకన్నా విద్యాధికురాలైనా, తెలివితేటలున్నా, సమర్ధురాలైనా ఆ స్త్రీని కోరుకోడు. యజమానిగా ఒకప్పుడు భార్యను అమ్మే అధికారం భర్తకుండేది. ఆమెను అప్పుక్రింద జమకట్టవచ్చును. భర్త ఆజ్ఞాపిస్తే నిప్పుల్లో దూకాలి. అసలు ఆడదంటే కేవలం భర్త సుఖసంతోషాల కొరకే సృష్టింపబడ్డ సెక్సు సింబల్‌గా చూడబడుతోంది; ఆర్థికాధిపత్యంలేని ఆధారపడి జీవించే ప్రాణి (పేరాసైట్) గా యెంచబడుతోంది. వివాహం, మాతృత్వాలవల్ల ఆమె స్థితి దయనీయమయింది. ఈ సాంఘిక నిమ్నోన్నతాలవల్ల స్త్రీల సాంస్కృతిక జీవితాలు విషాదాంతాలవుతున్నాయి. కిరసనాయిలు పోసుకొని కాలి చచ్చేవారి సంఖ్య రోజురోజుకూ ఎందుకు పెరుగుతోంది? అంటే స్త్రీలోని వ్యక్తిత్వాన్ని చంపి బాహ్యరూపాన్ని గౌరవిస్తున్నారన్నమాట! అందుకే కష్టాలొచ్చినప్పుడు నిలబడలేక అబలలు ఆత్మాహుతి చేసుకుంటున్నారు.

స్త్రీ స్వేచ్ఛను మతం పేరుతో, కుటుంబం పేరుతో, సమాజిక మర్యాదకోసం వమ్ము చేస్తున్నారు. అదికూడా ఆమె ఇష్ట పూర్వకంగా, సంతోషంగా, సహజంగా వదులుకోవాలి. ఆఖరికి భర్త తనని హత్యచేసినా, తానే ఆత్మహత్యకు పాల్పడ్డానని మరణ వాఙ్మూలంలో చెప్పిన కేసులెన్నో వున్నాయి. వ్యాపార ప్రకటనల్లో సినిమా పోష్టర్లలో నగ్నచిత్రాలు, బూతుసాహిత్యం ప్రచురించటంతో ఏ పురుషుడూ వ్యతిరేకించడూ; ఏ మతమూ ఘోషించదు. అప్పుడా మె పవిత్రత, సంస్కృతి ఏమవుతాయో! ఇలా స్త్రీ సాంఘిక, ఆర్థిక, నైతిక రంగాలలో అణగి మణగి వుండటానికి ఎన్ని కట్టుబాట్లు కావాలో అన్నింటికీ సిద్ధాంత యూపాలు వున్నాయి మన సాంస్కృతిక జీవిత విధానంలో! ఇక రాజకీయాలంటే నూరామడల దూరంలో వుంటారు. అది కేవలం పురుషులకేననే అపోహ స్త్రీల నరనరాన జీర్ణించిపోయింది. తన భర్త నిర్వహకుడనీ, తెలివికలవాడనే చూపు భార్యకుంటుంది. ఎం. ఏ లయినా

పి. హెచ్. డి లయినా, డాక్టర్లయినా, యాక్టర్లయినా ఈ దృక్పథంలో మార్పులేదు. అందుకే ఇంటా బైటాకూడా ఆమెకు రెండో స్థానమే శరణ్యమయింది.

మనదేశం గొప్పతనమేమిటంటే నాగరికతగా చూచుకుంటే మనం 20 వ శతాబ్దంలో వున్నాం. సామాజిక స్థితిగా ఆలోచిస్తే 19 వ శతాబ్దంలో వున్నాం. భావాల విషయంగా విచారిస్తే 16 వ శతాబ్దంలో వున్నాం. అంటే 400 సంవత్సరాలు వెనుకబడి వున్నామన్నమాట. ఆనాటి భావాలే ఈ నాటికి మనల్ని వెన్నాడుతూనేవున్నాయి. ఆమె వ్యక్తిత్వాన్ని కుంచించింది సమాజం. ఆమె శక్తుల్ని అణచి పెట్టాడుపురుషుడు. దానివల్ల నష్టపోయేది స్త్రీ లేననే భ్రమలో వున్నారేకాని మొత్తం మానవాళికే అనర్ధకం అని గ్రహించడం లేదు. ఇదీ జరుగుతున్న కథ; తరతరాల స్త్రీల గాథ. మరి ఈ నారీమణుల దృక్పథంలో మార్పు తేవడం అనివార్యమా? ఈ అస్తవ్యస్తాలు ఎందుకు జరుగుతున్నాయి? ఈ కృత్రిమ విలువల్ని ఎలా మార్చాలి? అనేవి మరికొన్ని చిక్కుప్రశ్నలు మనముందు కొచ్చాయి.

వెనుకటికి నీగ్రోలు తమ బానిసత్వాన్ని పెయింటింగ్సులో చూపారట: అలాగే నేటి స్త్రీలు తమ కష్టాలను, సమస్యలను సంజ్ఞలద్వారా చెప్పాలని ఆక్రోశిస్తున్నారు. స్త్రీ పురుషులిద్దరికీ ఒకే నీతి అమర్చిననాడు ఈ అస్తవ్యస్తాలుండవు. చెప్పుచేతల్లో పెట్టుకోవాలనే వాంఛ వున్నప్పుడే జీవి తలెత్తక తప్పదు. డార్విన్ అన్నట్లు "అణచబడ్డ ప్రతిజీవి వత్తిడికి తట్టుకోలేక ప్రతిఘటిస్తుంది." అంటే సమాజాన్ని నడిపించే విలువలు నిలుస్తాయి; మిగతావి అంతరిస్తాయి. ఏదైనా స్త్రీని బంధించే పాతకాలపు విలువలు, నాటి ఆదర్శాలు విడనాడి మనం ఆధునికులం కావాలి. దానికి ముఖ్యంగా స్త్రీలలో జాగృతి, చైతన్యం, ఆత్మవిశ్వాసం కలగాలి. ప్రతి స్త్రీ ఒక కందుకూరి, ఒక గురజాడా, ఒక రామ్మోహనరాయి కాగల్గాలి. వారిలో విద్వత్తు, విజ్ఞానం ప్రజ్వరిల్లాలి.

అసలు హక్కులు యాచించేవి కావు; ఒకరిచ్చేవి అంతకన్నాకావు. హక్కు అనేది మన జన్మతః వచ్చేవి; యాచించేది ధర్మం. హక్కుల్ని అనుభవించగల శక్తి, సామర్ధ్యాలు స్త్రీలలో రావాలంటే వారి దృక్పథంతో మార్పురావాలి. చట్టాలకు కట్నాలు పోతయ్యా అన్నట్లు చట్టాలద్వారా, ఆర్డినెన్సులద్వారా స్త్రీలలో మార్పు తెచ్చుట దురూహ్యాం. చట్టం అనేది కేవలం ఒక పనిముట్టు. అది కొంత రక్షణనిస్తుంది; మరికొంత భయాన్ని కలిగిస్తుంది. కాని మనలో దాస్యవిముక్తి రానంత

కాలం, మనలో ఆత్మవిశ్వాసం లేనంతకాలం, మనలో శాస్త్రీయ దృక్పధం పెంపొందించుకోనంతకాలం మన్ని రక్షించేవారుండరు; మనం సమానత్వాన్ని సాధించనూలేము; స్వేచ్ఛావాయువుల్ని పీల్చనూలేము. స్త్రీలు సామాజిక కార్యక్రమాల విషయంలో ప్రేక్షకులుగా వుండరాదు. స్వేచ్ఛగా, చైతన్యం కలవ్యక్తులుగా ఆర్థిక, రాజకీయ రంగాల్లోకి దూకాలి. తమ బానిసత్వ సంకెళ్ళను తెంచుకోవాలంటే పాతఆచారాలను, కట్టుబాట్లను అధిగమించాలి. దానికి ముమ్ముందుగా వారిభావాలలో, దృక్పధంలో మార్పు రావాలి.



# విడాకులు స్త్రీల సమస్యా?

"మాకు కావల్సింది రక్షణకాదు; విమోచన" అంటోంది ఆధునిక మహిళా లోకం. ఆనందదాయకం కాని వైవాహిక జీవితాన్ని గడపడం కన్నా ఘోర శిక్ష మరొకటి లేదంటున్నారు మారుతున్న మహిళలు. వివాహబంధం చాలా పవిత్రమైనదని, శాశ్వతమైనదని, చావు తప్ప దంపతులను వేరు చేయగల శక్తి లేనేలేదని నమ్మేవారు నేడూ వున్నారు. మన సంస్కృతి సనాతనాచారాలకు పుట్టినిల్లు. సంప్రదాయాలకు మెట్టినిల్లు. మన స్త్రీల స్థాయి, స్థానము, హోదా మధ్యయుగాలనాటి వారసత్వాన్ని అధిగమించలేని దశలో వున్నదనవచ్చు. అందువల్లే ఏ స్త్రీకి అయినా అవమానం జరిగినా, భర్త కొట్టినా, తిట్టినా, చంపినా చచ్చినట్లు పడివుంటే ఆమె మహా పతివ్రత అంటారు. మానభంగానికి గురిఅయినా కన్యగా గర్భవతి అయినా ఆమె ఆత్మహత్య చేసుకుంటే అయ్యో పాపం! అంటారు. ఆమె బ్రతికి తన జీవితాన్ని సంస్కరించుకుంటే సహించకపోగా ఆక్షేపిస్తుంది మన జాతి. ఇదీమన సంస్కృతి. సంస్కరణ కంటే నశింపుకే విలువ ఇచ్చేది హిందూ సంస్కృతి. అందులో ముఖ్యంగా స్త్రీ పరిస్థితి మారితే మరీ సహించరు.

అసలు విడాకులు స్త్రీలకే అవసరమా లేక పురుషులకు అవసరమా లేక ఉభయులకు అవసరమా తేల్చాలంటే ఈ సమస్యను అనేక దృక్పథాల నుండి పరిశీలించాల్సి వుంటుంది. చారిత్రక దృక్పథం నుండి, సామాజిక దృక్పథం నుండి, వ్యక్తిగతవైఖరిదృష్ట్యా గమనించాల్సి వుంటుంది. ఇలా అన్నివైపుల నుండి సమస్యను అధ్యయనం చేస్తేనే మనకు సరిఅయిన సమాధానం దొరుకుతుంది. చారిత్రక దృక్పథంతో విచారిస్తే 1948 వరకు హిందూస్త్రీకి, ఆమాటకొస్తే పురుషుడికి కూడ విడాకులు పొందేహక్కులేదు. ఇది మద్రాసు రాష్ట్రానికి సంబంధిచిన విషయం. 1948 లో మద్రాసు, బొంబే రాష్ట్రాలకు విడాకుల చట్ట వచ్చింది. 1955 నుండి భారత దేశంలో హిందూ స్త్రీ పురుషులకు కొన్ని పరిస్థితుల్లో విడాకులు పొందేహక్కు సంక్రమించింది. హిందూ వివాహ చట్టంతో దేశం మొత్తానికి వచ్చింది. అయితే 1948 కి పూర్వం హిందూపురుషుడు చేతనయితే, వీలయితే ఎందరి స్త్రీలనైనా వివాహమాడవచ్చు. అలా అతడు వివాహమాడినా సవతుల బాధ భరించలేని స్త్రీకి విడాకులు

పొందే అవకాశం లేదు. ఇప్పుడది లభించినది. 1939 కి పూర్వం వివాహ కాంట్రాక్టులో ఒప్పుదల చేసుకుంటేతప్ప ముస్లింస్త్రీకి విడాకులులేవు. కాని ముస్లిం పురుషుడు మాత్రం ఏకకాలంలో నలుగురిని కలిగివుండవచ్చు. దీన్ని బట్టి తేలిందేమంటే విడాకులనేవి స్త్రీలకు అవసరం. స్త్రీలకు బాధనుండి, కష్టాలనుండి విముక్తి కలుగ జేయటానికి విడాకుల శాసనము పుట్టాయని స్పష్టమవుతోంది. విడాకులు లేకపోయినా హిందూ, ముస్లిం, క్రిష్టియన్ పురుషుల స్థితి నష్టదాయకంగాలేదుకదా!

ఈ సందర్భంలో శాసనాల నడక, తీరు తెలిసికోవటం చాలా అవసరం. విడాకులను ప్రసాదించే శాసనాలు ఒక్కసారిగా ఊడిపడలేదు. గాలిలో పుట్టలేదు. సమాజంలో అణచివేతకు గురియై, నానాకష్టాలు పడుతున్న స్త్రీలకు తరుణోపాయం కలిగించటానికి ఇవి వుద్దేశించబడ్డాయి. భారతదేశంలో మహిళోద్యమం సాగించిన నిరంతరాందోళన, పట్టువిడని పోరాటాలవల్ల వచ్చాయి. ఎన్నో మహిళాసంఘాలు మరెన్నో మహిళామహాసభలు విడాకులు కావాలని తీర్మానాలు చేశాయి. పాశ్చాత్య స్త్రీల ఉద్యమాల నుండి ఉత్తేజాన్ని పొంది ఆందోళన సాగించాయి. సహృదయులైన కొందరు పురుషులు కూడా ఈ ప్రయత్నాలను బలపరిచారు. ఆ ఫలితంగానే ఈ శాసనాలు రూపందాల్చాయి. అయితే మనది పురుషాధిక్య సమాజం కనుక ఆ శాసనాలు కొన్ని పురుష పక్షపాతాన్ని ప్రదర్శించాయి. 1869 లో అమల్లోకొచ్చిన క్రయిస్తవులకు వర్తించే వివాహ శాసనం ఈ లక్షణాన్ని కలిగివుంది. విడాకులు, పొందాలంటే పురుషుడు భార్య వ్యభిచారిణి అని రుజువుచేస్తే సరిపోతుంది. కాని స్త్రీ విషయంవేరు. భర్త వ్యభిచార ప్రవృత్తినే కాక మరొక దానినికూడా (ఉదా॥ క్రూరత్వాన్ని లేక పునర్వివాహాన్ని ఇలా మరొక అంశాన్ని) ఆమె రుజువు చెయ్యాలి. అలాగే ముస్లిం పురుషుడు తనంత తానుగా మూడుసార్లు "తలాక్" ఇచ్చి తన భార్యకు విడాకులు ఇవ్వవచ్చు. కాని ముస్లిం స్త్రీలకిమాత్రం అలాంటి అవకాశమే లేదు.

మతధర్మ సూత్రాలలో - అన్ని మతధర్మ శాసనాలలోను - హిందువుల విడాకులకు సంబంధించిన శాసనం మిగతా వాటికన్నా ముందడుగు వేసిందని చెప్పక తప్పదు. నేటివరకు వచ్చిన సవరణల ఫలితంగా పరస్పర సమ్మతిమీద విడాకులు పొందవచ్చు. హింస, నిరాదరణ సందర్భాలలో కూడా విడాకులకు వీలుంది. అయితే హిందూస్త్రీ పిటీషనుద్వారా విడాకులను పొందగలదు. ముస్లిం స్త్రీ దావా

వేయవలసివుంది. అంటే అది వ్యయప్రయాసలతో కూడిందన్నమాట. క్రయిస్తవ స్త్రీ విడాకులు పొందాలంటే ముగ్గురు హైకోర్టు జడ్జీలు తీర్పు ఇవ్వాలి. అది ఎంత కష్టసాధ్యమో కాలహరణమో వేరే చెప్పాల్సిన పనిలేదు. భార్యాభర్తల మనస్తత్వాలు పొందికగా లేవనే కారణాన విడాకులు పొందేహక్కు ఏ మతస్తుల విడాకుల శాసనంలోనూ లేదు. ఆ మాటకొస్తే ప్రత్యేక వివాహ శాసనంలోనూ లేదు. ఇది శోచనీయం. భార్యాభర్తలు, అందులో ముఖ్యంగా స్త్రీ పడకటింటి రహస్యాలను, కుటుంబ విషయాలను బహిరంగ పర్చాల్సిన దుర్గతి ఎందుకుండాలి?

దాంపత్యమనే రధం కుంటు పడింటనేమాట (Marriage has Irretrievably broken down) ఇరువురిలో ఏ ఒక్కరూ, అందులో ముఖ్యంగా స్త్రీ ప్రకటిస్తే కోర్టు విడాకులను ఇచ్చే పరిస్థితి లేనేలేదు. దీని విషయమై పార్లమెంటులో ఒక బిల్లుకూడా వచ్చింది. ప్రజాభిప్రాయ సేకరణకు ఒక ఉన్నతాధికార దళం (Select committee) 1983 లో దేశమంతటా పర్యటన జరిపి సాక్ష్యాధారాలను సేకరించింది. అయినా ఆ సవరణ ఇంతవరకూ శాసనరూపం దాల్చనేలేదు. 1917 లో రష్యాలో విప్లవం వచ్చినప్పుడు ఏకపక్షంగా (యూనిలేటరుగా) పోస్టుకార్డు డైవోర్సు వుండేది. జపాన్, చైనా, రష్యాలాంటి దేశాలలో కుటుంబ న్యాయస్థానాలద్వారా పార్టీల మధ్య రాజీ కుదర్చటానికి ప్రయత్నాలు జరుగుతై. మనదేశంలో అలాంటి ప్రత్యేక న్యాయస్థానాలు లేనేలేవు. అందువల్ల స్త్రీలు కష్టనష్టాల పాలవుతున్నారు. 1976 హిందూ వివాహ సవరణ శాసనం ప్రకారం ఇద్దరి అంగీకారం మీద హిందూ వివాహం రద్దు కాగలదనే నిబంధన వచ్చింది. కాని మనస్తత్వాలు సరిపడనందున విడిపోవటానికి (Incompatability of Temperment) అవకాశం కావాలనే 1981 సవరణ చట్టం ప్రస్తుతం సెలక్టు కమిటీ దశలో వున్నది. ఆ బిల్లు వెంటనే చట్టరూపం దాల్చటం అత్యవసరం. భార్యాభర్తలిద్దరిలో ఏ ఒక్కరికి బాధ, అయిష్టతా వున్నా ఆ దాంపత్యం నరకప్రాయమే. కనుక ఎవరు కోరినా త్వరలో విడాకులిచ్చే కుటుంబ న్యాయస్థానాలు ఏర్పడాలి.

వ్యక్తి సామాజిక జీవి. కుటుంబం సామాజిక రూపం. కనుక వ్యక్తి తన స్వేచ్ఛను సమాజంలోనే అనుభవించగలడు. అలాగే కుటుంబం వ్యక్తి స్వేచ్ఛను ఇనుమడింపజేస్తూ వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తుంది. అలాకాక భార్యను ఒక పనిముట్టుగా, బానిసగా, పెంపుడు జంతువుగా పరిగణించి, ఆమె

వ్యక్తిత్వాన్ని చంపే భర్తను ఆమె విడనాడినా తప్పులేదు. అంతేకాక ఉదాత్త ఆశయాలుగల భార్య కుసంస్కారియైన భర్తను ఉదాత్తమైన విలువల కోసం వదలి పెట్టటం ఏరీత్యా చూచినా తప్పులేదు. దంపతుల మధ్య ప్రేమ, అనురాగం, ఆప్యాయతలు లేనివాడు, సభ్యత సామరస్యం పొసగనప్పుడు విడాకులకు అవకాశం లేని దాంపత్యం దుష్టమూ, వేదనాభరితము అవుతుంది. మాకు కావాల్సింది స్వేచ్ఛా సమానత్వమూ అని అరుస్తున్న ఆధునిక మహిళాలోకానికి అవసరమైనప్పుడు విడాకులు తేలిగ్గా పొందగల సౌకర్యాన్ని ప్రభుత్వం కలిగించాలి. దాన్ని సమాజం ఆమోదించాలి; స్త్రీలు ఆ తాహతును సంపాదించాలి. అలా కానినాడు విడాకులు స్త్రీలకే సమస్య అవుతుంది.

# జాతీయ పునర్నిర్మాణంలో స్త్రీ పాత్ర

మానవ హక్కుల్ని అమెరికన్, ఫ్రెంచి, రష్యన్ విప్లవాలు ఉద్ఘాటన చేసినప్పుడు స్త్రీలను మానవులుగా పరిగణించడం జరిగింది. జాతి అంటే సమాజం లేక ప్రజలు అంటున్నప్పుడు జాతిలో సగభాగం స్త్రీలున్నారు. కనుక సమాజ సమస్యలను పరిష్కరించటానికి స్త్రీలు సైతం భాగస్వాములు కాక తప్పదు. ఈ తోడ్పాటుకు తగిన జాగృతి స్త్రీలలో వుందా అనేది ఒక ప్రశ్న అయితే అసలు వారిని వారే ఉద్ధరించుకోలేని నారీలోకం దేశ సమస్యల నెలా తీర్చి దిద్దగలరు అనేది మరో చిక్కుప్రశ్న అయి కూర్చుంది. కనుక మహిళలు తమ సమస్యలను సరిదిద్దుకుంటూనే దేశ ప్రగతికి తోడ్పడాల్సిన సమయం ఆసన్నమయింది. అంటే నేటి స్త్రీకి ఏకకాలంలోనే రెండు బాధ్యతలు నెత్తిన పడ్డాయని గమనించక తప్పదు. ఈ ప్రయత్నం దుస్సాధ్యమయినా అసాధ్యం మాత్రం కాదు.

మహిళలు తాము సమాన హక్కులకై పోరాడుతున్నప్పుడు ప్రపంచ సమస్యలను కేవలం పురుషులకే వదలి వేయడం సమానతా భావానికే గొడ్డలిపెట్టు. సామాజిక సమస్యలను గురించి స్త్రీలు కేవలం ప్రేక్షకులు కారాదు. దేశ సమస్యలను పురుషులు సరిదిద్దేవరకూ స్త్రీలు మిన్నకుండుట క్షంతవ్యం కాదు సరికదా దేశద్రోహమన్నా తప్పులేదు. విజ్ఞానం, వివేకం, చైతన్యం గల స్త్రీలు సామాజిక మార్పు, ప్రగతికోసం పోరాటం, తిరుగుబాటులాంటి ఉద్యమాలు నడపటం అనివార్యం కావాలి. నేటి స్త్రీ పురోగమన లక్ష్యం కేవలం తమ హక్కులను అనుభవించుటకొరకే ఆరాటపడితే చాలదు. దేశ కష్టనష్టాలేకాక యావత్ ప్రపంచ సమస్యలను పరిదిద్దుటలో భాగస్వామ్యం వహించాలి. ఇది చాలా బాధ్యత, కర్తవ్యాలతో కూడిన సంక్లిష్టమైన కార్యభారం అనక తప్పదు.

ఏ మానవుడితోనైనా మహిళలు సమాన హోదా పొందాలంటే తమ బాధలు, సమస్యలు దేశ ప్రజల దుఃఖాలతో, బాధలతో మిళితమై వుంటాయి కాని అవి పూర్తిగా వేరుగా వుండే అవకాశం లేదు. అందువల్ల స్త్రీ విమోచనలోనే పురుష ప్రగతి, తద్వారా దేశాభ్యుదయం ఇమిడి వుంటాయని గ్రహించాలి. కనుకనే

ఈనాటి మహిళోద్యమ వైఖరిలో సిద్ధాంత పరంగాను, ఆచరణలోనూ కొంతమార్పు అనివార్యం అవుతోంది. ఆమార్పును గుర్తించగల స్థాయి ప్రజలలో రాక తప్పదు. తరం మారినప్పుడల్లా సంప్రదాయాలు, ఆచారాలు, సిద్ధాంతాలు మారుతూవుంటాయి. ఆ మార్పులతోబాటు భావాలలోనూ మార్పువస్తేనే పురోగమనం వుంటుంది. లేదా భవిష్యత్తు శూన్యమవుతుంది.

రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో మౌలికమైన మార్పువస్తేనే జాతిని సుసంపన్నం చేసుకోగలం. దానికి స్త్రీ పాత్ర వెన్నుముక లాంటిది. దేశస్వాతంత్ర్యానంతరం చట్టపరంగా భారత స్త్రీకి కొన్ని హక్కులు నిర్దేశింపబడ్డాయి. వాటికి రాజ్యాంగం హామి (Guarantee) ఇచ్చింది. కాని 37 సంవత్సరాలయినా స్త్రీలు ఆ హక్కులను అనుభవించడం లేదనే చేదునిజం మనకు తెలియనిదికాదు. మూడు వేల సంవత్సరాలుగా అణగద్రొక్కబడిన మహిళలు ఈనాడు హక్కు లిచ్చినా అనుభవించలేని స్థితిలో వుండటంలో ఆశ్చర్యం లేదు. అందువల్లనే రాజకీయాలంటేనే స్త్రీలు విముఖత చూపుతున్నారు. అది కేవలం పురుషులే సరిదిద్దగలరని, వారే ప్రాతినిధ్యం వహిస్తారనే భావం స్త్రీలలో ప్రబలంగా వుంది. అది చాలాపొరపాటు ప్రతి సంస్కరణ స్త్రీ జీవితంతో ముడివడి వుంటుందని స్త్రీ పురుషులిద్దరూ ముందుగా గ్రహించిన నాడే స్త్రీలు రాజకీయాల్లో పాల్గొంటారు. అందువల్ల సాంఘిక, రాజకీయాలు రెండు బొమ్మా బొరుసూ లాంటవని గ్రహించాలి.

జాతీయ పునర్నిర్మాణంలో రాజకీయంగా స్త్రీల ప్రాతినిధ్యం వారి నిష్పత్తి ప్రాతిపదికగా పెంచాలి. స్త్రీలు చేయాల్సిన పనులలో ముఖ్యమైనవి మూడు _ శాసనాలు అమలు పర్చటం, ప్రభుత్వం తమ విధులు సక్రమంగా నెరవేర్చేటట్లూ చేయడం, ప్రజాభిప్రాయాన్ని తలదాల్చటం _ ఇవి పౌరులందరూ విద్యావంతులైతేనే జరిగే ముఖ్య విధులు. కనుక స్త్రీలు విజ్ఞత కలిగి దేశ పునర్నిర్మాణాధిపత్యంలో ప్రముఖపాత్ర వహించాలి. అప్పుడే స్త్రీ పురుషుల మధ్య తేడాను తొలగించే బాధ్యత ప్రభుత్వం చేపట్టగలదు.

స్త్రీలు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించి సామాజిక వ్యవహారాల్లో ప్రధాన భూమిక వహించిననాడే వర్గ పోరాటం సమసి పోతుంది. విద్యావంతులు, ఉద్యోగినులు సైతం భర్తల ఆధిపత్యాన్ని శిరసావహించి 'పేరాసైట్స్' గా వుండటానికి ఇష్టపడతారుతప్ప వ్యక్తిత్వాన్ని కోరుకోరు. చట్టలో ప్రావీణ్యతవల్ల

పురోగమనం లేదు. స్వయంకృషి, ఆత్మాభిమానాలవల్లనే ఆర్థిక స్వేచ్ఛ పొందగలరు. అనాడే వరకట్న నిర్మూలనం, సమాన వేతనచట్టం ఖచ్చితంగా అమలు పరుస్తారు. తద్వారా భూమిహక్కు, వారసత్వపుహక్కు, ఉపాధికల్పనలో నిష్పత్తి ప్రకారం స్త్రీలకు కేటాయింపు - యిలాంటివి జరుగుతాయి.

నేడు సామాజికంగా స్త్రీ పురుష భేదాలు; కులమత దురభిమానాలు విలయ తాండవం చేస్తున్నాయి. కులమతాలకు పట్టుకొమ్మ స్త్రీ. కారణం శాస్త్రీయ అవగాహన స్త్రీలలో మృగ్యం కావటమనవచ్చు. కనుకనే తమ బంగారు సంకెళ్ళను చూచి తామే గర్విస్తున్నారు. సామాజిక కార్యక్రమాల్లో స్త్రీని కేవలం దిష్టిబొమ్మలా చిత్రిస్తున్నారు. స్త్రీలు తాము తక్కువ అనే భావంతో వుండటంవల్లనే పురుషులు ఇష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు. సామాజికం, రాజకీయం బొమ్మా బొరుసు లాంటివి కనుక సాంఘిక అసమానతలు సమసిపోవాలంటే స్త్రీలు సారథ్యం వహించాలి. ముమ్మరంగా నిరక్షరాస్యత నిర్మూలన జరగాలి. ఇవి సభలు, సమావేశాలు, చర్చలద్వారా మాత్రమే జరుగవు. నిస్తబ్ధత, భావదాస్యం వారిలో అంతం కావాలి.



నేటి రచనల్లో స్త్రీని స్త్రీరచయితలు సైతం చీకటి యుగంలోకి నెట్టేస్తున్నారు. కారణం వారు సైతం పురుషాధిక్య సమాజాన్నే ప్రాతిపదికగా గుర్తిస్తున్నారు. దాన్నే వారు యథాతథ వాదమని నర్మగర్భితంగా వివరిస్తున్నారు. అలాగే ప్రతి చిత్రంలోను 'నీ పాదదాసిని' అనే భావాన్ని ప్రోదిచేస్తూ ముగిస్తారు. అలా సంచులు నింపుకునే నిర్మాతలను, రచయితలను స్త్రీలు ఎదుర్కొంటేనే ప్రభుత్వం వాటిని బహిష్కరిస్తుంది. ఇలా ప్రతి స్త్రీ సర్వతోముఖంగా తన హక్కులను, కోర్కెలను నిలుపు కుంటూనే అటు దేశప్రగతికి కూడా తోడ్పడాలి. ఎప్పుడైతే ఆమె గాఢనిద్ర మేల్కొంటుందో, ఎప్పుడైతే సమానత్వ ప్రాతిపదికమీద పయనిస్తుందో అప్పుడే, ఆమె సమస్యలూ, దేశసమస్యలూ ఏకకాలంలో సమసిపోతాయి. వీటికి ఆర్తి ఆవేదనా, త్యాగం కావాలి. ఆ స్థితికి స్త్రీలు రాక తప్పదు.



మానవ జీవితం ఏ ఒక్క సూత్రానికి; ఏ ఒక్క పద్ధతికి ఎలా కట్టుబడదో అలాగే దేశసమస్యలు కాని మహిళల సమస్యలు కాని, వైవిధ్యంగా వుంటాయి. కులము, మతము, దోపిడీ, అవినీతి, లంచగొండితనం, కల్తీలు, నల్లబజారు, అధిక జనాభా, ఆశ్రితపక్షపాతం - ఒకటేమిటి సవాలక్ష రుగ్మతలున్నాయి దేశంలో. అలాగే

ఆర్థిక అసహాయత్వం, రాజకీయ నిరాదరణ, వరదా, వ్యభిచారం, బాల్యవివాహం, నిర్బంధవైధవ్యం, సాంఘిక దోపిడీ, భర్తల దౌష్ట్యం, మానసిక క్షోభ, తిట్టటం, కొట్టటం, చంపటం, అత్యాచారాలు, ఆత్మహత్యలు, మానభంగాలలాంటివి సవాలక్ష సమస్యలతో సతమతమయ్యే మహిళలు అసంఖ్యాకంగా వున్నారు. ఇంకా విద్యలో, వివాహంలో, దాంపత్య జీవితంలో; పెంపకంలో ఆడది ఆడదే అంటారు. ఇన్ని ఈతి బాధల్ని ఎదుర్కోవాలంటే వారిలో జాగృతి రావాలి. ఈ సమాజంలో, ఈ దేశంలో, ఈ కుటుంబంలో నేనూ భాగస్వామిని, నాకూ హక్కులూ, బాధ్యతలున్నాయని మన మహిళలు గ్రహించిననాడు వారు జాతీయ పునర్నిర్మాణంలో అసలైన బాధ్యత వహించి జాతి ప్రగతికి తోడ్పడగలరు.



# కుటుంబ నియంత్రణ : మహిళా సంఘాలు

దేశ జనాభాలో సగం మంది స్త్రీలు. బాలబాలికలను సుశిక్షిత పౌరులుగా తయారుచేసేది స్త్రీలు. బిడ్డలు తల్లుల ననుకరించడం సర్వసామాన్యం. కనుక స్త్రీలు విద్యా విజ్ఞానాలార్జించుటేకాక ఆరోగ్యవంతులుగా వున్ననాడే వారు సర్వతో ముఖంగా వికసించ గలుగుతారు; ప్రజాస్వామిక రాజ్యంలో నిజమైన భాగస్వాము లవుతారు. ఆర్థిక అసమానత్వం, సాంఘిక దోపిడీల నుండికూడా ఆమె విముక్తి పొందగలుగుతారు. స్త్రీకి తగిన విశ్రాంతి కావాలంటే అధిక సంతాన ఊబినుండి బైటపడాలి. దానికనువైన సమాజం కావాలి. ముఖ్యంగా 80 శాతం అవిద్యావంతులైన స్త్రీలలో జాగృతి తేవాలంటే మహిళాసంఘాలు స్వచ్ఛంద సంస్థలు నడుం బిగించాలి.

ఒకనాడు అవహేళనకు గురియై అనేకనిందలు ఇక్కట్లపాలైన కుటుంబ నియంత్రణోద్యమం ఈనాడు ప్రజామోదం పొందింది. పాపహేతువని పలికిన మతాధిపతులు, పీఠాధిపతులు మనస్సులు మార్చుకుంటున్నారు. ముస్లింలు, క్రైస్తవులు సయితం వారి వారి మతాలకు సమ్మతమయ్యే నియంత్రణ మార్గాలను అన్వేషిస్తున్నారు. పలువురు పలురకాల అభిప్రాయాలతో ఆలోచిస్తున్నారు. ఆహార ధాన్యాల కొరత, నిరుద్యోగం, విద్యా వైద్య సదుపాయాలలోటు గృహనిర్మాణ లేమి లాంటివిఅవి. కాని అన్నిటికన్నా ముఖ్యమైనది అధిక కాన్పులవల్ల చనిపోయే స్త్రీల సంఖ్య గురించి! ఆమె ఆరోగ్యంగురించీ, అంతగా పట్టించుకోక పోవటం అనాగరిక లక్షణం కదా? పాపమని, భ్రూణహత్యఅని, మాతృత్వం వహించటానికే స్త్రీని దేవుడు సృష్టించాడని, గర్భస్రావం అంటే జీవిని గర్భంలో ఖూనీ చేయడమేనని, ప్రకృతి సహజ శక్తులకు వ్యతిరేకమని, ఆపరేషన్లు అమానుషమని రకరకాల భావాలుగల మూఢనమ్మకాలున్నవారు ఈనాడు కూడా కోకొల్లలుగా వున్నారు. బ్రహ్మచర్యం, ఆత్మనిగ్రహం, యోగం, రక్షితకాలం, ఆయుర్వేదంలాంటి విధానాలను సూచిస్తున్నారొక వర్గంవారు. అజ్ఞానం, దారిద్ర్యం, మతప్రభావం, ఉదాసీనత, పక్షదృష్టి, స్త్రీల అవివేకాలే అసలు సమస్యను అర్థం చేసుకోలేక పోవటానికి ముఖ్యకారణాలు. కనుకనే మన ప్రగతి

శూన్యమవుతోంది. ఏటా కోటి ముప్పైలక్షల మంది జనాభా పెరుగుతోంది. జనాభా గుణకార పద్ధతిలోనూ, వనరులు కూడికపద్ధతిలోనూ పెరుగుతున్నాయని ఆర్థిక తత్వవేత్త థామస్ మాల్థాస్ సిద్ధాంతము. ఈనాడు 68 కోట్ల 50 లక్షలకు పెరిగిన మన జనాభాను ఎలా పోషించాలి? ఇవి నేడు మనముందున్న ప్రశ్నలు.

దేశ ప్రజానీకం ఆరోగ్యవంతముగా, సుఖవంతంగా, జీవించాలంటే ప్రతి వ్యక్తికి కనీసం అవసరాలైన ఆహారం, విద్యా, వైద్యవసతి సౌకర్యాలు విధిగా వుండాలి. ఈనాటి సామాజిక వ్యవస్థ అందరికీ వాటిని గ్యారంటీ ఇవ్వలేని పరిస్థితిలో వుంది. ఇది శోచనీయము. అయినా వాస్తవిక దృక్పధంతో ఆలోచిస్తే ఇలాంటి సమాజం యొక్క పరిధిలోనే మనం స్త్రీ సంక్షేమం, కుటుంబనియంత్రణ లాంటి అంశాలను చర్చించాల్సి వుంటుంది. 1956 నుండి ప్రచారం సాగుతున్నా ఈ సమస్యను అదుపులో పెట్టామని చెప్పుకోగల పరిస్థితి ఇంకా ఏర్పడలేదు. దానికి కారణాలనేకం. కనుక సమస్యను అన్ని కోణాలనుండి తిరిగి పరిశీలించాల్సి వుంటుంది. అసలు సమస్య అవగాహనతీరు, దాని పరిష్కార మార్గాన్వేషణా విధానం ఎన్నుకున్న సాధన సంపత్తి, నిర్మించుకున్న యంత్రాంగంయొక్క పటుత్వత- అన్నింటికన్నా చిత్తశుద్ధి మొదలైనవి లక్ష్య స్పష్టతకు అవసరమని తేలింది.

కార్యక్రమం ఎంత మంచిదైనా ఒక ప్రభుత్వంగాని, స్వచ్ఛందరంగం గాని ఈ సమస్యను తాముగా పరిష్కరించలేవు. ప్రభుత్వ విధానాలకు ప్రజల తోడ్పాటు, ప్రజల వుత్సాహానికి ప్రభుత్వ అండదండలు వుంటేనే ఏ కార్యక్రమమైనా సఫలమవుతుంది. కుటుంబనియంత్రణ బహు సున్నితమైన సమస్య. అది భార్యాభర్తల కిద్దరికీ సంబంధించినది. ఆలుమగల సంబంధాలు మధుర తరమైనవైనా బహుక్లిష్టమైనవిగా వుంటాయి. కనుక వాటి సంబంధమైన అంశం బండగా మోటుగా పరిష్కరించ పూనలేము. కనుకనే స్వచ్ఛంద సంస్థల పాత్ర చాలా ప్రాముఖ్యత వహిస్తోంది. కొన్ని సమస్యలు వైయుక్తిక స్థాయిలో పరిష్కరిస్తాం. కాని వ్యక్తి ఉద్వేగాలకు, ఉద్రేకాలకు సంబంధించిన విషయాలు తాముగా కాక తమ సహచరులద్వారా పరిష్కరించుకుంటారు. కనుక మహిళా సంఘాలు ప్రముఖపాత్ర వహించాల్సి వుంటుంది.

లక్ష్యనిర్దేశము, కార్యక్రమము ఈ రెండూ ఒకదానిపై మరొకటి ఆధారపడి

వుంటాయి. అమలు పర్చజాలని లక్ష్యాలను నిర్దేశించుకుంటే ఆచరణలో వైఫల్యమేగాక వైరాశ్యం ఎదురవుతుంది. లక్ష్యాలను చేర్చగల కార్యక్రమాన్ని ఎన్నుకోలేకపోతే ఆశయం నెరవేరదు. ఈ విషయాన్ని విస్మరిస్తే ప్రభుత్వమూ, స్వచ్ఛందసేవా కార్యకర్తలు ముప్పున పడవచ్చు. కనుక ప్రభుత్వమూ, సేవాసంస్థలూ పూర్వాపరాలను గుర్తించి, వాస్తవాలను గమనించి, శాస్త్రీయ దృక్పధంతో విశ్లేషణ చేసుకొని కార్యక్రమానికి ఉపక్రమించాలి.

ఆరోగ్యంతో, స్త్రీ సంక్షేమంతో కుటుంబనియంత్రణను ముడిపెట్టడం సముచితమే. కాని దానిపై సవతితల్లి ప్రేమ చూపడం క్షంతవ్యం కాదు. 1956 లో నల్గురు చాలు అన్నారు. తరువాత ముగ్గురు సరిపోరా అని ప్రశ్నించారు. ఇప్పుడు ఇద్దరికి తగ్గించారు. మనతోపాటు ఆధునికతలో అడుగుపెట్టిన చైనాలో ఒకబిడ్డ గలవార్ని ఆదర్శంగా ఎన్నుకున్నారు. ఒకపిల్ల అయితే ఆ కుటుంబంయొక్క ఆరోగ్యం చూడటం, విద్య స్థాయిపెంపు, గృహవసతి, మంచి ఉద్యోగం, ఋణాలు పెన్షన్ హెచ్చింపు లాంటి ప్రోత్సాహాలు చాలా వున్నాయి. ఇద్దరు, ముగ్గురు పిల్లలయితే అనేక నష్టాలు కలుగ జేస్తున్నారు. మనం చైనాకన్నా ముందుగా ఈ ప్రచారం సాగించినా వెనుకబడి వున్నాము. కనుక కారణాలు అన్వేషించాలి. ఆత్మసంతృప్తితో స్థబ్దతగా పడివుండటం ప్రగతికి దోహదం చేయదు. కనుక స్వచ్ఛంద సంస్థలు – ముఖ్యంగా మహిళాసంఘాలు ప్రభుత్వం మీద వత్తిడితేవాలి. 1975 వరకు ఉధృతరూపం తాల్చిన ఈ కార్యక్రమం కొంతమంది స్వచ్ఛంద కార్యకర్తల దురుసుతనం వల్లా, అవసరమైన ప్రజాభిప్రాయ నిర్మాణం జరగనందునా బెడసి కొట్టింది. సంప్రదాయం, మౌఢ్యం విజృంభించాయి. అసలుకే మోసంవచ్చింది. ప్రజోపయోగకరమైన ఉద్యమం అభాసుపాలయింది. ఫలితంగా నియంత్రణపై నొక్కు, తీవ్రత తగ్గి, ప్రత్యేక ప్రాముఖ్యత నశించి ఆరోగ్యం స్త్రీ సంక్షేమంలో భాగమయింది. స్వచ్ఛంద సేవాసంస్థలు, కార్యకర్తలూ సిద్ధమవుతున్న తరుణంలో ఈ ప్రమాదం సంభవించింది. మరల ఆ భావాన్ని పునరుద్ధరించుట అవశ్యకర్తవ్యం. దాని కనుగుణమైన చర్యలను దశలవారీగా చేపట్టాలి. మంత్రులు, శాసనసభ్యులు ముమ్ముందుగా పాటించాలి. ఆ తరువాత ప్రభుత్వోద్యోగులు, తదుపరి ప్రభుత్వ సంస్థల ఉద్యోగులు, ఆపైన వ్యక్తిగత సహకార సంస్థల ఉద్యోగులు, ఇతర ఉద్యోగులు, స్వచ్ఛంద ఉపాధి కలవారు, తదితరులు ఇలాంటి కార్యక్రమం చేపట్టాలి. అందుకనుగుణమైన రాజ్యాంగ సవరణను ప్రభుత్వం చేయించాలి. తగిన విధానాన్ని ప్రభుత్వం అమలుపరచాలి. సేవాసంస్థలు, – ముఖ్యంగా మహిళా మండలులూ చొరవ తీసుకోవాలి.

1981 లో జకార్తాలో జరిగిన ప్రపంచ కుటుంబనియంత్రణ సభలలో అభివృద్ధి చెందుతున్న దేశాలు వారి ఆర్థిక సంపత్తిలో 5 శాతం ఈ కార్యక్రమాలకు కేటాయించాలని తీర్మానించారు. మన ప్రభుత్వం చేస్తున్న ఖర్చు సద్వినియోగం కావాలంటే ప్రభుత్వయంత్రాంగం చిత్తశుద్ధితో, పట్టుదలతో కార్యక్రమాన్ని సాగించినా ప్రజలు సహకరించకపోతే వైఫల్యం తప్పదు. కనుక వారికి ప్రోత్సాహం, ప్రేరణ కలిగించే సదుపాయాల (Incentives) ను కల్పించాలి. ఈ పద్ధతి సూత్రప్రాయంగా అంగీకరింపబడటయే కాక, ఒకరకంగా అమలులో వున్నది ఈనాడు. ఆపరేషను చేయించుకున్న స్త్రీకి పురుషునికి ధనము, ఇళ్ళస్థలాలు ఉద్యోగావకాశాలు ఇంక్రిమెంట్లు, స్టయిపెండ్లు, పెన్షన్లు, అప్పులులాంటి ఇతరాధిక సౌకర్యాలు కలిగించాలి. ఇంకా ఒకబిడ్డతో సరిపెట్టుకోని వారికి పోనుపోను పెరిగే క్రమంలో ఇంక్రిమెంట్లు వగైరాలలో కోతలు ఏర్పాటు చేయాలి. వీటికోసం ప్రచారంచేసి ప్రభుత్వంచేత వీటిని ఆమోదింప చేయటం మహిళా సంఘాలు చేయాల్సిన పనులలో ముఖ్యమైనది. సమర్థవంతముగా జరిపించదగ్గ కార్యక్రమం మరొకటి వుంది. ఇరుగుపొరుగు సంఘాలను (Neighbourhood Committees) నిర్మించి వాటిద్వారా స్త్రీలలో జాగృతి కల్పించి తద్వారా వారిని ఈ కార్యక్రమాలకు సుముఖులను చేయటం మహిళాసంఘాలకర్తవ్యం. స్త్రీ తన ఇరుగుపొరుగు స్త్రీని, సహచరిని నమ్ముతుంది. ఆమె అభిప్రాయాలను గౌరవిస్తుంది. ఆమె అనుభవాల నుండి కూడా గుణపాఠాలు నేర్చుకోవాలని తాపత్రయ పడుతుంది కనుక మహిళా సంఘాలు ఈ కార్యక్రమం అందిపుచ్చుకుంటే విజయవంతముగా నిర్వహించగలవు.

ఇంతవరకు మహిళాసంఘాలు ఇలాంటి కార్యక్రమాలు నిర్వహించటంలేదు. కారణాలు ఒకటికాదు, అనేకం. కొద్ది చదువుకున్న స్త్రీలు – ముఖ్యంగా గ్రామాలలో సంప్రదాయ కుటుంబాలలో నుండి రావడంతో వారిలో సనాతన భావాలు అంత తేలికగా నశించవు. ఏదోమూల కాస్తోకూస్తో వారి మస్తిష్కాలలో మూఢనమ్మకం వుంటూనే వుంటుంది. అందువల్ల వారు ఇలాంటి వాటిలో చొరవ తీసుకొనడంలేదు. అది శోచనీయం. కాగా నూతన దృక్పథంతో సాగిపోయే కొద్దిమంది కార్యకర్తల, మహిళామండలుల చొరవతో ఈ భావ పరంపర పెరుగుతుంది. ఆ అభివృద్ధితోపాటు కుటుంబనియంత్రణ; కుటుంబ సంక్షేమ ఉద్యమాల సాఫల్యత కూడా పెరుగుతుంది. కనుక స్వచ్ఛంద సేవాసంఘాల, మహిళాసంఘాల పాత్ర అద్వితీయమైనది ఆచరణ యోగ్యమయినదికూడా.

# స్త్రీల సమస్యా: శాస్త్రీయ అవగాహన

సైన్సు వేరు జీవితం వేరు, అనే దృష్టిగలవారు అసంఖ్యాకంగా ఉన్నారు. సైన్సును జీవితావసరాలకు వాడుకోవటమేతప్ప జీవితసమస్యల్ని పరిష్కరించుకోటానికి తాత్వికరీత్యా అది ఉపకరించదని వారిభావం. ఈ వాదన సత్యదూరం. సైన్సు పనిచేసే తీరును శాస్త్రీయపద్ధతి (Scientific Method) అంటారు. పరిష్కరించ టానికి అసాధ్యమైన ప్రశ్నలను సైన్సు లేవనెత్తదు. అప్పటి పరిజ్ఞానాన్ని ప్రాతి పదికగా తీసుకొని ఒక ఊహాధారాన్ని మనస్సులో ఊహించుకుంటాడు శాస్త్రజ్ఞుడు. అయితే ఈ ఊహాధారం (Hypothesis) వాస్తవానికి నిలుస్తుందా, లేదా అని ప్రయోగంద్వారా తరచి చూస్తాడు. అంతేకాక అది తర్కనైశిత్యానికి తట్టుకోవాల్సి వుంటుంది. ఇలా తర్కానికి, అనుభవానికి నిలిచిన ఊహాధారాన్ని సత్యంగా స్వీకరిస్తాడు శాస్త్రజ్ఞుడు. కనుక శాస్త్రీయ పద్ధతిలో ప్రశ్న, ఊహాధారం, ప్రయోగం, తర్కం అన్నీ చోటుచేసుకుంటాయి. శాస్త్రజ్ఞుడు నిరంతర జిజ్ఞాసి. ప్రతిదానిని పరిశీలిస్తాడు; తరచి చూస్తాడు; ప్రశ్నిస్తాడు; దేనిని గ్రుడ్డిగా నమ్మడు. శాస్త్రీయమైన బుద్ధి; సహేతుకమైన ఆలోచనాధోరణి కలిగివుండటమే శాస్త్రీయదృక్పథం (Scientific Temper) అంటారు. ప్రశ్నించడం, ఆలోచించడం, అవగాహన చేసుకోవడం, సునిశితమైన, పరిశీలనాత్మకమైన, సృజనాత్మకమైన బుద్ధికలిగినవారినే శాస్త్రీయఅవగాహన గలవారుగా పేర్కొనవచ్చు. వారెప్పుడూ భవిష్యత్తుగూర్చి ఆలోచిస్తారు కాని, భూతకాలంపై వారిదృష్టి వుండదు. సంక్షుభిత మనస్తత్వానికి లోనుకారు. వారిది ప్రశాంతస్థితి. వారుఅలౌకికాన్ని నమ్మరు మృత్యువు తర్వాత కర్మ, పునర్జన్మలలో వారికి విశ్వాసం వుండదు. దేవునిపై విశ్వాసం లేకుండానే మానవాళి మనుగడకు, సత్యాన్వేషణకు నిరంతరం శాస్త్రజ్ఞుడు కృషి చేస్తూనే వుంటాడు.

తనకు తెలియనిదాన్నిగురించి (అజ్ఞాతశక్తి) న భయమే మత ఆదేశాలకు ప్రమాణమయింది. ఆ శక్తినే దైవమని నమ్మాడు అనాగిరికదశలోని మానవుడు.

అలాంటి అలౌకికశక్తిని నమ్మడమే మతానికి ప్రాతిపదిక. మూఢవిశ్వాసాలతోనూ, మతసిద్ధాంతాలతోను విజ్ఞానశాస్త్రం అనాదిగా పోరాడుతూనేవుంది; గౌరవ ప్రపత్తులు పొందుతూనేవుంది. అశేషప్రజానీక సంక్షేమానికి, పురోగతికి కృషిచేసే పదార్థవాదం ఉనికి ఈనాటిదికాదు. భావవాదాన్ని త్రోసి రాజనే భౌతికవాదాన్ని ఏనాటికైనా మనం చేరకతప్పదు. మతనమ్మకాలన్నీ అజ్ఞానం, భ్రాంతివల్ల ఊహించబడ్డాయి. ఆ యా సామాజిక పరిస్థితుల్లో కారణాంతరాలవల్ల మతం పుట్టింది. స్వర్గం, నరకం, దేవుడు, కర్మ, పునర్జన్మ మతభ్రమలే. మతానికి అహంకారం, ద్వేషం, ఈర్ష్య ముఖ్యాంగాలు. విజ్ఞానశాస్త్రానికి వినయం, వివేకం వున్నాయి. అది తెలియని విషయాలు అంగీకరించి క్రమేణా తెలుసుకుంటుంది. విజ్ఞాన శాస్త్రం, మానవవాదం వ్యక్తి ఆలోచనా పద్ధతికి కట్టుబడివుండి, మానవసమస్యల్ని పరిష్కరిస్తాయి. సామాజిక సమస్యలను పరిష్కరించుకోవటానికి హేతువాదులు శాస్త్రీయపద్ధతిని అవలంబిస్తారు. శాస్త్రీయ అవగాహన, శాస్త్రీయ భావన వారికి పెట్టని సొమ్ములు. భారత సమాజంలో స్త్రీల శోచనీయ పరిస్థితికి పరిష్కార మార్గం సాధించాలంటే శాస్త్రీయ దృష్టితో మహిళాసమస్యలు పరిశీలించాలి.

విద్యావిషయికంగా భారతదేశంలో అగ్రభాగాన వుంటున్న కేరళలాంటి రాష్ట్రంలోనే హేతువాద మహాసభల్లో నూటికి పదిసుంది మాత్రమే మహిళా ప్రతినిధులు వుంటున్నారు. మొత్తంమీద భారతస్త్రీలు సమాజంలో వెనుకబడి వున్నారనే దానికి ఇది నిదర్శనం. సామాజికంగా, విద్యావిషయికంగా, రాజకీయంగా, ఆర్థికంగా స్త్రీలు వెనుకబడి వున్నారనేది నగ్నసత్యం. ఈ పరిస్థితి సమాజం సామరస్యంగా, ఆరోగ్యలక్షణాలతో పెరగడానికి ఉపకరించదు. ఈ పరిస్థితిని ఇలా కొనసాగించటానికి హేతువాదులు ఇష్టపడతారా? ముమ్మాటికి ఇష్టపడరనే జవాబు చెప్పవలసి వస్తుంది.

<u>నేటి స్త్రీలస్థితి:</u> స్త్రీలలో అధిక సంఖ్యాకులు అజ్ఞానంలో, మౌఢ్యంలో కొట్టుమిట్టాడుతున్నారనే అంశాన్ని ఈ సందర్భంలో మనం గమనించాలి. అనేకమంది విద్యావంతులైన స్త్రీలు మత భావనలవల్ల ప్రభావితులౌతున్నారు. వ్రతాలను, మతక్రతువులను, పూజావిధానాలను కొనసాగిస్తున్నారు. మానవ సమస్యలను మానవమేధస్సు పరిష్కరించగలదనే విశ్వాసం వారికిలేదు. చీటికీ మాటికీ భగన్నామం జపిస్తూ దైవప్రసక్తి తెస్తారు. తాము చేసిన పాపాల నుండి విముక్తికోసమో, లేక వరాలకోసమో తిరుపతి, గురవయ్యూరు దేవాలయాలకు

పరుగెడతారు. బాబాలను, అమ్మలను భక్తిప్రపత్తులతో కొలుస్తారు. వారి ఆజ్ఞలను శిరసావహిస్తూ వారిని గుడ్డిగానమ్మి మోసపోతూవుంటారు. శిష్యుల కంటే శిష్యురాండ్రసంఖ్యే మిక్కుటంగా వుంటుంది. సైన్సు చదివిన ఒక లేడీడాక్టరు తనవద్దకొచ్చినస్త్రీకి గర్భస్రావము పాపమనే అభిప్రాయంతో గర్భస్రావంచేయకుండా త్రిప్పిపంపింది. గొప్పగొప్ప డిగ్రీలున్న మరోమహిళ రామేశ్వరంలో నాగప్రతిష్ఠ చేసివచ్చింది సంతానప్రాప్తికోసం. విజ్ఞానశాస్త్రాన్ని తెలుసుకున్నంతమాత్రాన శాస్త్రీయదృక్పథం ఏర్పడదు. డిప్లమాలు, డిగ్రీలు వున్నంతమాత్రాన వికాసం, వివేకము వున్నట్లుకాదు. అన్ని మతాలకు చెందిన విద్యావంతులైన స్త్రీలస్థితి ఇలాగేవుంది.

మరో విచారకరమైన విషయాన్ని మనం గమనించాలి. అనాధలకు సేవచేసి నందుకు మదర్ థెరీసాకు ప్రపంచవిఖ్యాతమైన నోబుల్ బహుమానం వచ్చింది. ఆ అవకాశం తీసుకొని గర్భస్రావంమీద, సమాజంలో స్త్రీ స్థానంమీద తన అభిప్రాయాలను ఆమె ప్రచారంచేయడం సాగించింది. ప్రపంచమంతటా ఆమె పర్యటిస్తూ, ప్రతిచోటా తన ఉపన్యాసంలో ఈ పై రెండుఅంశాలను ఆమె ప్రస్తావించింది. గర్భంలో శిశువును చంపటంతో గర్భస్రావం సమానమని ఆమె పిలుపు ఇచ్చింది. తల్లేతన పిల్లను చంపితే నీతికి స్థానమెక్కడున్నదని ప్రశ్నించింది. స్త్రీ ఇంటిపట్టున ఉండాలని, ఇంటి బయటిప్రపంచం పురుషుని కొరకు నిర్దేశింపబడిందని ఆమె ప్రజలకు ఉద్బోధించింది. ఇతరస్త్రీలకు ఆమె ఇచ్చిన సలహాలను ఆమె పాటించకపోవటం విచిత్రంకాదా! "మరినీవు ఇంటినుండి బయటికివచ్చి పురుషప్రపంచంలో ఎందుకు అడుగుపెట్టావు?" అని మనం థెరీసాను ప్రశ్నిస్తే ఈ'పవిత్రస్త్రీలు' స్త్రీలబంధాలను తొలగించటానికి పూనుకొన్నారనితెలుతోంది.

ఈ పరిస్థితిని ఎందుకు మార్చాలి? సమాజంలో స్త్రీలు సగంమంది వున్నారు. అంత మందిస్త్రీలు మూఢవిశ్వాసాలలో, మతమౌఢ్యంలో మునిగితేలుతున్నపుడు సమాజానికి పురోగతి అసంభవం. కనుక స్త్రీ జనసంక్షేమానికి, బాలల కల్యాణానికి ఎంతో అవసర మైన భౌతిక వనరులను, సంపదను మనం కూడబెట్టాలి. అందుకు మానవప్రయత్నాన్ని, శక్తిని మనం వృధాచేయకుండా వినియోగించగలం. తల్లులుగా స్త్రీలు తమ సంతానానికి శాస్త్రీయదృక్పధాన్ని, శాస్త్రీయభావనను కలుగజేయగలరు. జన్మ నిరోధం, కుటుంబనియంత్రణ, గర్భస్రావంలాంటి పద్ధతులను అవలంబించిన స్త్రీలు పరిమితకుటుంబాలను ఏర్పరచుకొని బండచాకిరీనుండి విముక్తిపొందగలరు, వారు

విశ్రాంతి సమయంలో విద్యను ఆర్జించగలరు; సామాజికవ్యవహారాలలో పాల్గొనగలరు. అప్పుడు ప్రజాస్వామ్యం వాస్తవరూపం తాలుస్తుంది. ప్రకృతికి అతీతమైన శక్తులలో స్త్రీలకు విశ్వాసం పోయినందువల్ల ఆత్మవిశ్వాసాన్ని పొందగలరు. అప్పుడు వారు హేతుబద్ధంగా, నైతికంగా జీవయాత్ర సాగిస్తారు. ఇంతవరకు అన్నిమతాలు బానిసత్వాన్ని, అసమానత్వాన్ని, వివిధవర్గాలమధ్య ద్వేషాన్ని, శత్రుత్వాన్ని పోషించాయి. నాగరికత ప్రారంభమైనప్పటినుండి. స్త్రీని వస్తువుగానో, లేక బానిసగానో లేక తక్కువస్థాయిగల వ్యక్తిగానో చూడటం జరిగింది. ఇటీవలనే ఆమె తన హోదాను పొందగల్గుతున్నది. కనుక స్త్రీలు స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, న్యాయంలాంటి వాటికోసం పోరాడవలసిన తరుణం ఆసన్నమయింది. చివరికారణం ప్రత్యేకంగా హేతువాదులకు సంబంధించినది. కుటుంబంలో పురుషులు హేతువాదులై - స్త్రీలు మతస్తులైతే అనేక చిక్కులుఉత్పన్నమవుతాయి. మతమౌఢ్యంలో వున్నస్త్రీలు తమ పురుషులను - ఎంతగా అభిమానించినా — వెనుకకు లాగుతారు. ఈ జీవితసత్యాన్ని విస్మరించటం ప్రమాదకరం. కనుక హేతువాదులైన పురుషులు చివరకు స్వార్థచింతనతోనైనా తమ ఇళ్ళలోని స్త్రీలను, తదితర స్త్రీలను విద్యావంతులను చేయటం అత్యవసరం.

ఏం చేయాలి ? ముందు ఇంటగెలిచి రచ్చగెలవమన్నారు. కనుక భార్య నిరక్షరాస్యురాలయితే ఆమెను విద్యావంతురాలిగా చేయాలి హేతువాదియైన పురుషుడు. ఆమెకు అంతకుక్రితం కొంత విద్యాగంధం ఉంటే విద్యాస్థాయిని పెంపొందింపచేయాలి. ఆమె శాస్త్రీయభావనను, శాస్త్రీయ మనస్తత్వాన్ని అలవరుచుకోవటానికి సాయపడాలి. శాస్త్రీయదృక్పథాన్ని ఆమె సంతరించుకోవటానికి ప్రోద్బలం చేయాలి. ప్రతి విషయాన్ని గ్రుడ్డిగా నమ్మకుండా ప్రశ్నించేధోరణిని ఆమె చేపట్టేలా చేయాలి. తర్కానికి, అనుభవానికి నిలవని ఏ ప్రవచనాన్ని, ఏ గురువాక్యాన్ని ఆమె నమ్మని స్థితి రావాలి. అంతేకాదు హేతువాద కుటుంబసభ్యులు వ్యక్తిగతంగా ఉన్నత శ్రేణిలో జ్ఞానాన్ని ఆర్జించాలి. నైపుణ్యశక్తి సంపాదించాలి. కులం, మతం, జాతి, భాష, దేశంలాంటి పరిధులను వారు సామాజికంగా దాటగలగాలి. సమాజం యొక్క రాజకీయ ఆర్థిక కార్యకలాపాలలో వారు హేతుబద్ధంగా పాల్గొనాలి. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, సామాజికన్యాయం అనే సూత్రాలపై నిర్మింపబడే సహకార శ్రేయోరాజ్యాన్ని వారు నిర్మించాలి.

ప్రతివ్యక్తి రెండురకాలుగా సమాజాన్ని మార్చగలడు. ఒకటి సామాజిక కార్యక్రమాలవల్ల, రెండవది తన వ్యక్తిగత జీవితంలో నిర్దుష్టంగా జీవిస్తూ ఇతరులకు ఆదర్శప్రాయంగా మెలగటంవలన.

స్త్రీలయెడ, శిశువులయెడ హేతువాదుల దృక్పథం తతిమ్మావారి భావనకంటే వేరుగా ఉంటుంది; ఉండాలి. సంతానాన్ని కనేశక్తి ప్రకృతి స్త్రీలకిచ్చిన వరం. కాని శిశుపోషణను స్త్రీలుమాత్రమే చేపట్టనవసరంలేదు. ఈ కర్తవ్య నిర్వహణలో పురుషులుకూడా పాల్గొనవలసిఉన్నది. ఇంటిపని విషయంలోనూ అలాగే జరగాలి. స్త్రీలు ఈ సందర్భంగా మోస్తున్నభారాన్ని చాలవరకు పురుషులు తగ్గించగలరు. చాలామంది పురుషులు – కొంతమంది హేతువాదపురుషులుకూడా – స్త్రీ చేసే నడుమువిరిగే పనియొక్క బాధాకరపరిస్థితిని గమనించటంలేదు. స్త్రీయొక్క జీవితంలో విలువైన అనేక సంవత్సరాలు ఆమె పిల్లలను కనడంలోనూ, పెంచడం లోనూ, ఇంటిపని చేయడంలోనూ వినియోగిస్తున్నది ఈనాడు. ఈ పరిస్థితిమారాలి

హేతువాదులైన తల్లిదండ్రులు తమ పిల్లలను తమ ఆస్తిగా చూడరాదు. పిల్లలు వ్యక్తులు. వారి వ్యక్తిత్వ వికాసానికి వారు హక్కు కలిగిఉన్నారు. ఈ అంశాన్ని తల్లిదండ్రులు ఎంతత్వరగా గుర్తిస్తే అంతమంచిది.

పురుషులు – అందులో ముఖ్యంగా హేతువాదులైన పురుషులు – ఈ సందర్భంగా తమ విధ్యుక్తధర్మాన్ని గుర్తించి కార్యాచరణకు పూనుకుంటేనే స్త్రీలలో శాస్త్రీయ అవగాహన, శాస్త్రీయ దృక్పథం వస్తాయి.



# మన వివాహవ్యవస్థ : నాడు, నేడు

నేడు వివాహవ్యవస్థా, కుటుంబవ్యవస్థా లేని మానవజాతిలేదు. నాగరిక సమాజం ఏర్పడినప్పటినుండి వివాహం కీలకపాత్ర వహిస్తోంది. వివాహం మానవ జీవితయాత్రా సమరానికి చరమదశకాదు; నాందిమాత్రమే. అలాంటి వివాహం ఎప్పుడు పుట్టింది? ఎలా పుట్టింది? వివాహపు తొలిదశ ఏమిటి? అనే విషయాలు ఇదమిద్ధంగా చెప్పటం సాధ్యంకానిపని. చరిత్రాకారులు సైతం వివాహ వ్యవస్థగురించి స్పష్టంగా ప్రకటించినట్లు ఆధారాలు లేవు. అయినా మోర్గన్,మార్క్స్, ఆల్‌టేకర్, కపాడియా, ఏంగెల్సులాంటి సమాజశాస్త్రజ్ఞులు, మానవశాస్త్రజ్ఞులు కొన్ని సిద్ధాంతాలు ప్రతిపాదించారు. వాటిపై అనేక విమర్శలుకూడా వచ్చాయి. ఏదేమయినా వివాహవ్యవస్థ ఒకనాడు ఉద్భవించిందికాదు. కాలచక్రపరిభ్రమణంలో వచ్చిన పరిణామఫలితం అది. కనుక గతచరిత్రను తరిచిచూస్తేతప్ప వర్తమాన, భవిష్యత్తులు అవగాహనకావు.

మానవజాతి శైశవదశ (జంతుదశ) లో స్త్రీ పురుషుల నడుమ వావివరుసలు లేని లైంగిక జీవనం గడిపేవారు. అంటే ఒక గుంపులోని పురుషులకు మరో గుంపులోని స్త్రీలతో సంపర్కం వుండేది. తల్లీ కూతురూ ఇద్దరూ ఒకే పురుషునికై పోరాడిన సందర్భాలుకూడా వుండేవి. నాడు బిడ్డలకు తండ్రిఎవరో తెలియదు; తండ్రికి పిల్లలబాధ్యతాలేదు. కుటుంబవ్యవస్థాలేదు. తల్లే పిల్లల్ని సంరక్షిస్తూ వుండేది. ఈ దశలో విచ్చలవిడిగా లైంగిక క్రీడ జరుగుతుండేదని, కాలక్రమేణా గుంపుపెళ్ళి (సామూహిక వివాహం) అంటే ఒక సమాజంలో నిర్ణయింపబడిన కొందరు పురుషులకు మరికొందరు స్త్రీలకు సంపర్కానికై ఒక ఏర్పాటు వుండేదని. ఈ పద్ధతిప్రకారం పురుషులగుంపులోనుండి ఏ పురుషుడైనా ఒప్పందంకుదిరిన స్త్రీల సమూహంనుండి ఏ స్త్రీతోనైనా సంభోగించవచ్చని, దీన్నికూడా పెళ్ళిగానే ఆ నాటి సమాజాలు భావించాయని, ఈ గుంపుపెళ్ళి క్రమేపి బహుభార్యాత్వంగా మార్పుచెంది కాలక్రమేణా ఏకవివాహం (మోనోగమీ) గా పరిణామంచెందిందని మానవశాస్త్ర పరిణామవాదియైన ఎల్. హెచ్. మోర్గాన్ పేర్కొన్నాడు. ఇది కొన్నివందల

వేల సం॥ రాల తర్వాత జరిగింది. దీనినే "మోర్గన్ పరిణామవాదం" అంటారు. అనాగరికదశలో రక్తసంబంధ నిషేధాలు లేవని, (అంటే అన్నాచెల్లెలు, తండ్రి కూతురు, మధ్య కూడా సంపర్కాలు) ఉమ్మడి వివాహబంధంలో ఇమిడి వుండే వారని, ఒక్కొక్కమార్పు వచ్చినప్పుడల్లా వారిసంఖ్య తగ్గిపోతూ చివరికి ఆ బంధంలో ఒక్క జంటగా మాత్రమే మనగల్గేస్థితి వచ్చిందని ఫ్రెడిరిక్ ఏంగెల్సు తన "కుటుంబం, వ్యక్తిగత ఆస్తి" అనే గ్రంథంలో వ్రాశాడు. ఏకవివాహ వ్యవస్థ అతి ప్రాచీన మానవదశనుండి వున్నదన్న అభిప్రాయాన్ని వ్యక్తపరిచాడు వెస్టర్‌మార్క్ (Wester Mark) పండితుడు. తొలిమానవునికి నిర్దుష్టమైన సంస్కృతికాని, ఆచారవ్యవహారాలుగాని, నైతికసూత్రాలుకాని లేవని వెస్టర్‌మార్క్‌ని ఖండిస్తూ, ఆనాడు ఏకవివాహవ్యవస్థే లేదన్నాడు ముర్డక్ (Murdock). మానవుడు శైశవదశలో వావివరుసలు లేని స్వైరతి జీవితాన్ని కొనసాగించేవాడనియు, తల్లిమాత్రం ఆయా పురుషులతో బిడ్డలను కంటూ వారితోనే జీవితాన్ని గడిపేదని బ్రిఫాల్టు (Briffault) 'ది మదర్స్' అనే గ్రంథంలో వ్రాశాడు. ప్రఖ్యాత సమాజశాస్త్రజ్ఞులైన సమ్నర్ (Sumner), కెల్లర్ (Keller) ఆదిలో కుటుంబంగాని, పెళ్ళికాని లేవని, రక్తసంబంధీకులైన కొన్ని సమూహాల ప్రజలు విడివిడిగా జీవనాన్ని సాగిస్తూ వుండేవారని 'దిసైన్సు ఆఫ్ సొసైటి' లో చెప్పారు. బెకోఫెన్ (Bacho Fen) 'మదర్‌రైట్సు' అనే తన గ్రంథంలో ఆదిమానవుడు ఇచ్ఛారతిని కొనసాగించేవాడని, కుటుంబం తొలిదశలో ఆడపెత్తనాలు (Matriarchal) మాతృస్వామ్య కుటుంబాలు వుండేవని ఆ కుటుంబాలలో స్త్రీలు సాంఘికపరమైన, మతపరమైన ఆధిక్యతను పొంది కుటుంబపెద్దగా వుండేవారని ప్రతిపాదించాడు.

మనదేశంలో ఋగ్వేదకాలమునుండి వివాహవ్యవస్థ ఒక ప్రత్యేకస్థానాన్ని పొందిందని చెప్పుకోవచ్చు. అన్నా చెల్లెళ్ళమధ్య వివాహం నిషేధింపబడ్డది ఋగ్వేదంలోనే. పంచమవేదమనే భారతంలోకూడా కన్యలైన సత్యవతి, కుంతి తల్లులైనారు. ద్రౌపతి పంచభర్తృక. ఉత్తరభారతంలో, కురురాజ్యంలో స్త్రీ పురుషులు విచ్చలవిడిగా తిరుగుతుండేదశలో శ్వేతకేతువు స్త్రీ పురుషులిరువురూ విధేయులుగా వుండాలంటూ వివాహాన్ని సక్రమపద్ధతిలో శాసిస్తూ, వివాహానికొక నీతిని ప్రతిపాదించాడు.

అసలు వివాహానికి సంబంధించిన విధినిషేధాలు అతి జటిలంగా వుంటాయి. కాలమానపరిస్థితుల్నిబట్టి మారుతూవుంటాయి. వధూవరుల్ని ఎంపికచేసుకోవటానికి

అనేక పద్ధతుల్ని గృహ్యాసూత్రాలు, ధర్మశాస్త్రాలు, స్మృతులు ప్రవేశపెట్టాయి. వాటిలో ముఖ్యమైనది మనుధర్మశాస్త్రం. అందులో అష్టవిధ వివాహాలు రూపొందించబడ్డాయి. బ్రహ్మం, ప్రాజాపత్యం, ఆర్షం, దైవం,గాంధర్వం, అసురం, రాక్షసం, పైశాచికం అనేవే అవి. వీటిలో బ్రహ్మం లేక ప్రాజాపత్యంమాత్రం మతపరమైన కన్యాదానం ఉండుటవల్ల నిలిచాయి మిగతావన్నీ మరుగునపడ్డాయి. అలాగే నాటి స్వయంవరాలు నేటికథలుగా మారాయి. మనువు ప్రతిపాదించిన 'నియోగం' నేడు హాస్యాస్పదం అయింది. వింటేనే జుగుప్స కలుగుతుంది. బిడ్డలులేని విధవరాలికి బావ, లేక మరిది, లేక దాయాది సంతానప్రదానం చెయ్యాలి. ఆమెకు పిండోత్పత్తి కాగానే అతనితో సంపర్కం నిషేధంకావాలి. ఆనాడు పితృదేవతలు, యజ్ఞాలు పిండప్రదానాలకు పుత్రుడు విధిగా వుండాలి. అందువల్ల నియోగం ఆచారమయింది.

మానవజీవితంలో వివాహం ఉత్కృష్టమైనది; ముఖ్యమైనదికూడాను. జీవితాంతం సహచర్యానికి, సన్నిహితత్వానికి, ఆత్మీయతకు ఏర్పడిందే వివాహం. అలాంటి వివాహవ్యవస్థ ఎలాంటి మార్పులు చెందిందీ, ఇంకా ఎలా పరిణతి చెందాలి అనేది నేటి చర్చనీయాంశమయింది. సమాజం అతివేగంతో పయనిస్తోంది. విజ్ఞానశాస్త్రం విశ్వకవాటాలను ఛేధిస్తూ పరుగిడుతోంది. ఆ దశలో మరి మన పాత వివాహవ్యవస్థకూడా మారకతప్పదుకదా: మరి ఆ మార్పులు చట్టరీత్యా మతాలవారీగా విచారించక తప్పదు.

1929 లో బాల్యవివాహ నిషేధశాసనం వచ్చింది. వధువుకు 18 వరునికి 21 ఏండ్లు నిండాలని శాసించింది. బాల్యవివాహం జరిగిన హిందూ ఆడపిల్ల 18 నిండేలోగా తనకాపెళ్ళి వద్దనే హక్కు వుంది. కాని ముస్లింకన్యకు ఆ హక్కు లేదు. పార్సీచట్టం ప్రకారం దంపతులలో 14 సం॥ పిల్లకు, 16 సం॥ వరునికి వున్నప్పుడు ఆ పెళ్ళి చెల్లదని కోర్టు తీర్పు ఇవ్వవచ్చు. హిందూ వివాహం 1978 వరకూ మారుతూనేవుంది. 1939 లో ముస్లిం వివాహ సవరణ చివరిసారి జరిగింది. 1972 నాటి క్రైస్తవ వివాహ శాసనంప్రకారం వారిపెళ్ళి చర్చిలో దేవుని ఎదుట మతగురువు చేయిస్తాడు. క్రైస్తవవధువు "నీకు జీవితాంతం విధేయురాలిగా వుంటా" నని ప్రమాణంచేయడం గమనార్హం. 1939 నాటి పార్సీ వివాహచట్టం ఇంకా అలాగేవుంది. ముస్లింలు, తమ వివాహాలను 'నికా' రిజిష్టరులోనూ, క్రైస్తవులు చర్చి రిజిష్టరులోను నమోదు చేస్తారు. హిందూ వివాహశాసనం లోపభూయిష్ఠం. అంటే ఇస్లాం, క్రైస్తవం, పార్సీ, యూదుమతాలకు చెందకుండా

స్థిరనివాసమున్న ప్రతి భారతీయుడు హిందువుక్రిందలెక్క. అంటే హేతువాదులు, అజ్ఞేయవాదులు, నాస్తికులు, స్వేచ్ఛాభావులు వీరంతా హిందువులంటూ హిందూ వివాహచట్టం వారికికూడా వర్తింపచేశారు. కాని వధూవరులలో ఏ ఒక్కరి ఆచారం ప్రకారమైనా వివాహం (దండలమార్పిడి వగైరాలు) జరుపుకోవచ్చు; ఆ ఆచారాన్ని అవసరమైతే కోర్టులో ధృవపర్చుకోవాలి. 1967 నుండి తమిళనాడులో పూలదండల పెళ్ళిళ్ళు, స్వయంవరవివాహాలు ఏ భాషలోజరిగినా చెల్లుతున్నాయి వారి చట్టరీత్యా. మిగతారాష్ట్రాల ప్రభుత్వాలు కూడా అలా చేయాలని కోరటం తప్పుకాదుకాదా, అంతేకాదు పెండ్లిపద్ధతిలో సర్వులకూ వర్తించే విధానాన్ని చట్టబద్ధంచేస్తేనే స్త్రీలు మతాలవిషకౌగిలినుండి బైటపడి స్వేచ్ఛావాయువులు పీల్చగలుగుతారు కనుక ఒకే వ్యవహారసంహిత (Common Civil Code) అవశ్యం ప్రవేశపెట్టాలి.

వివాహవ్యవస్థలో నాటికి, నేటికి జరిగిన మార్పులలో ముఖ్యమైనవి కొన్ని చర్చించడం అవశ్యకర్తవ్యం. కన్యాశుల్కవివాహం అంటే కొంత డబ్బిచ్చి పిల్లను కొనుక్కోవడం. దీనిసే అసురంగా ప్రతిపాదించాడు మనువు. డబ్బు కట్టలేనపుడు ఆ వరుడు అత్తమామల కుటుంబాలకు చాకిరీచేసి ఋణవిముక్తుడయ్యేవాడు. నేడు అది సమసిపోయి వరశుల్కం ఆచారమయింది. 1961 లో వరశుల్కం నేరమని కట్నం ఇచ్చినా పుచ్చుకున్నా శిక్షార్హులని చట్టం వచ్చింది. అయినా ఆ దురాచారం ఇంకా రోజురోజుకూ ప్రబలిపోతోంది. ఇంతవరకూ వివాహఎంపిక పెద్దలద్వారానే జరిగేది. నేడు అక్కడక్కడా ప్రేమ వివాహాలు జరుగుతున్నాయి. 1948 వరకు బహుభార్యాత్వం హిందువులకు అమల్లో వుండేది. నేడు అది శిక్ష, నేరముగా చట్టాలొచ్చాయి. 1856 వరకూ విధవావివాహాలు నిషిద్ధం. నేడుఇంకా సనాతనులు వ్యతిరేకిస్తున్నారు. ఆధునికులు ముందుకొస్తున్నారు. అక్కడక్కడా బహు అరుదుగా జరుగుతూనే వున్నాయి. వివాహవిధానాలు నాడు పూర్తిగా మతపరంగా జరిగేవి. నేడు వధూవరులలో ఏ ఒక్కరి ఆచారం ప్రకారమైనా చెల్లుతాయి. ఇప్పటికీ సంతానవతియైన స్త్రీనితప్ప వివాహమాడరు కొన్ని దేశాలలో. కన్యనే వివాహమాడేవారు కొందరైతే విధవావివాహం అమల్లో వుంటుంది కొన్నిచోట్ల; అది నిషేధం మరికొన్ని ప్రాంతాలలో, ముసుగులో దూరడమే పెండ్లితంతుగా ఒకతెగలోవుంటే సూత్రాధారణ మరొకజాతిలో వుంటుంది. ఓలికి ఒకజాతి ప్రాధాన్యతఇస్తే వరకట్నానికి ప్రాముఖ్యతవుంది మరోజాతిలో. ఇతరత్రా ప్రతిబంధకాలు లేని స్త్రీ పురుషులిద్దరూ బహుకాలంగా కలిసి కాపురం చేస్తుంటే వారినిభార్యాభర్తలుగా ఎంచవచ్చని సాక్ష్యసంబంధమైన (Indian Evidence Act)

114 వ సెక్షన్ చెప్పింది. అలా ఆచారాన్నిబట్టి వివాహపద్ధతుల్లో ఎన్నో ఆచారాలు, సంప్రదాయాలు వున్నాయి. అలాగే 1872 నుండి అమల్లో కొచ్చిన ప్రత్యేక వివాహశాసనం 1954 లో మార్పుచెందింది. నాడు 14, 18 ఏళ్ళు నిండాలన్నది తర్వాత 18 - 21 సం॥ నిండాలనే సవరణ జరిగింది. నాడు ఏ మతానికి చెందనివారికి లేక భిన్నమతస్థులకు మాత్రమే వర్తించేది ప్రత్యేక వివాహశాసనం. నేడు ఒకే మతంలో వారుకూడా ఈ శాసనం ప్రకారం చేసుకోవచ్చు. అలాగే 1948 కి పూర్వం విడాకులకు అసలు అవకాశమేలేదు. 1948 నుండి ఉమ్మడిరాష్ట్రమైన ఆంధ్రా, మద్రాసులకొచ్చింది. 1955 నుండి విడాకులచట్టం మొత్తం దేశానికొచ్చింది. 1939 వరకు 'నికా' లో ఏర్పాటువుంటేతప్ప ముస్లింస్త్రీకి విడాకులకు హక్కులేదు. కాని 39 నుండి 'నికా' లో రాసుకోకపోయినా కోరవచ్చు. ఆనాడు పెళ్ళి తప్పనిసరి నేడు పెళ్ళితంతులేకుండా కలిసివున్నా తప్పు లేదనే వాదాలు వచ్చాయి. ఇలా ప్రాంతాన్నిబట్టి చట్టాలనుబట్టి ఆచారాల్నిబట్టి వివాహవిధానాల్లో అనేక మార్పులు వచ్చాయి. ఇంకా వస్తున్నాయి.

ఇటీవల సంస్కరణవివాహాలు, ఆదర్శవివాహాలు, విప్లవవివాహాలు (నాడు లేనివి) జరుగుతున్నాయి. సంస్కరణవివాహమంటే పెండ్లిపద్ధతిలోకాని, పెండ్లి షరతులలోకాని, ప్రమాణాలలోకాని మార్పు వుంటుంది. అంటే సంస్కృతానికి బదులు తెలుగులో మంత్రాలు చదివినా సంస్కరణక్రిందలెక్కే. అలా ఏదో మార్పు వుంటుంది ఇందులో. ఇక ఆదర్శవివాహంలో కన్యాదానం వుండదు. ఒకరినొకరు ఎన్నుకొనుట వుంటుంది. పెళ్ళిప్రమాణాలు అర్థమయ్యే భాషలో జరుగుతాయి. కలిమిలేములలో కష్టసుఖాలలో పాలు పంచుకుంటూ నీకు స్నేహితురాలిగా, సహచరిగా, ప్రేయసిగా వుంటానని వధువూ, పదాలమార్పుతో వరుడు ప్రమాణం చేస్తారు. కాని "జీవితాంతం కలిసి వుంటా" మని చెప్పరు. సంస్కరణవివాహాలు, ఆధునిక వివాహాలు పురుషులేకాక స్త్రీల ఆధ్వర్యంలోకూడా జరుగుతాయి.

విప్లవవివాహంలో పెండ్లితంతూవుండదు, వేదికావుండదు. ప్రమాణాలు అసలే వుండవు. ప్రేయసి ప్రియులిద్దరికీ ఒకరిపై రెండవవారికి హక్కులూ, బాధ్యత వుండవు. పరస్పరగౌరవం, సదవగాహన, సానుభూతితోకూడిన స్పందన ప్రేమానురాగాలు వుంటాయి. మానసికస్వేచ్ఛకు, నికొల్సయిన ప్రణయానికి ఇందులో చోటువుంది. ఇది పరిణతమనస్కులకే చెల్లుతుంది. ప్రేమ కొరవడిననాడు కోర్టురభస, సామాజిక దౌష్ట్యాలకు తలవొగ్గకుండా విడిగా వుంటారు. అసలు ఈ పద్ధతిని వివాహం అని చెప్పటానికి ఒప్పుకోరు కొందరు. కాని వివాహపద్ధతులు దేశ, కాల, ప్రాంతాలను

బట్టి వుంటాయని చెప్పుకొన్నాంకదా! ఆదర్శ విప్లవవివాహాలు విలక్షణమైనవి. ఇద్దరూ స్వయంపూర్ణమైన వ్యక్తులుగా విశాల పరిధిగల అభ్యుదయంలోకి అడుగు, పెడతాడు. రెండోవ్యక్తికై పాటుపడతారుకాని తమ స్వార్థానికి వాడుకోరు. ఈ విప్లవవివాహాలు సర్వులకూ వర్తించకపోవచ్చు; పనికిరాకపోవచ్చు. స్వేచ్ఛా జీవులకు, మానవవిలువలను గౌరవించేవారికి మాత్రమే ఆచరణయోగ్యమవుతాయి.

పెళ్ళికి ఏదోవిధమైన తంతు వుండాలి? అసలు వివాహవ్యవస్థ అవసరమా? వ్యవస్థ వుండాలంటే ఏ పద్ధతిలో జరగాలి అనేవి ముఖ్యప్రశ్నలు - ఏదోవిధమైన పెళ్ళితంతు లేనిదే చట్టబద్ధమైన ఆస్తిహక్కులు భార్యాబిడ్డలకురావు. భార్యాభర్తలనే గుర్తింపు పెళ్ళిద్వారానే సమాజం గుర్తిస్తుంది పెళ్ళికానివాళ్ళని పెళ్ళికాకుండా కలిసి వుండేవాళ్ళను సమాజం ఆవహేళనగా చూస్తుంది ఈ రెంటిని తట్టుకోగలధైర్య స్థయిర్యాలు ముందు పరిగ్రహించాలి సాంప్రదాయ వివాహంలో వున్న కృత్రిమాన్ని, అసహజత్వాన్ని అర్థంచేసుకున్నవారు ఏ విధమైన తంతునూ అంగీకరించరు. అది విప్లవాత్మకమైన వివాహం - అంటే ఆఖరికి దండలమార్పిడికూడా లేకుండా, మూడోవ్యక్తిప్రమేయం లేకుండా కలిసి కాపురం చెయ్యటం. ఎప్పటికైనా ఆ స్థితి దాంపత్యజీవితంలో చోటుచేసుకోవాలి. అది ఉన్నతోన్నతమైనది. అది పరిణత మనస్కులకే చెల్లుతుంది. ఆ స్థితికి ఎదగలేనివారు విప్లవవివాహంకన్నా తక్కువైన ఆదర్శవివాహం లేక సంస్కరణవివాహాలద్వారా వివాహబంధంలో ప్రవేశించక తప్పదు.

వివాహవ్యవస్థలోని ముఖ్యలోపాల్ని ఈ సందర్భంగా చెప్పుకోకతప్పదు. స్త్రీ స్వేచ్ఛ సంపూర్ణంగా నశించేది పెళ్ళితోనే. వివాహమంటే 25 గంటలూ పనిచేసే పనికత్తెను భార్యరూపంలో పొందడమే ననే భావం పురుషులలో పెనవేసుకొనివుంది వివాహితస్త్రీ భర్తపైప్రేమ, మాతృత్వంపై అనురాగంవల్ల తన వ్యక్తిత్వాన్ని చంపుకొని తన్నుతాను నాశనం చేసుకుంటుంది. ఆమె ఏనాడు తనకోసం బ్రతుకుతూ తన శక్తియుక్తుల వికాసానికి దోహదం చేసుకోగలుగుతుందో ఆనాడే తన్ను తానుద్ధరించుకుంటుంది. సమాజం మారితే (ఆర్థికంగా) స్త్రీ సమస్యలు మారతాయనేది పొరపాటు. స్త్రీ తన జీవితాన్ని మార్చుకుంటూ సమాజాన్నికూడా మార్చటానికి ఏకకాలంలోనే ప్రయత్నించాలి. ఆస్థి సమాజపరమైన సోషలిష్టుదేశాలలో కూడా స్త్రీ పురుషుల అసమానత్వం కొనసాగుతోందనేది నగ్నసత్యం. వివాహం ఏ పద్ధతిలో జరిగినా సరే స్త్రీ మాత్రం విధిగా వివాహమాడాలి. అప్పుడే ఆమెకు భద్రతా, గౌరవమూ లభిస్తున్నాయి. కట్నం తక్కువతెచ్చిన పిల్లను చంపటం,

ఇంటినుండి గెంటడం అనివార్యమవుతోంది ఈనాడు. భార్యాభర్తల సంబంధం వ్యాపారలక్షణమయింది. కారణం స్త్రీ హోదా పురుషునిహోదాకంటే హీనమయిందనీ, హేయమయిందనేభావం వుండబట్టే. అందువల్లే కన్యాదానం, పరశుల్కంలాంటి దురాచారాలు ఇంకా జరుగుతూనేవున్నాయి. ఈ విధమైన వివాహవ్యవస్థ స్త్రీకి 'స్వేచ్ఛలేని' ఇలాకొనసాగేకన్నా అసలు వివాహవ్యవస్థ రద్దయిపోవడమే శుభకరమనే భావం స్త్రీలలో కలగాలి. అందుకొరకై అవసరమొస్తే ఆడవారు కన్యలుగా జీవించినా తప్పులేదు. ఆనాడే స్త్రీని గౌరవిస్తారు; సమానస్థాయితో పెళ్ళాడుతారు.

ఎన్నో అసాధ్యాలు ఈనాడు సాధ్యాలయినాయి. ఎన్నోరంగాలలో మరెన్నో మార్పులొచ్చాయి. శాస్త్రీయవిజ్ఞానం అనంతంగా పెరిగింది. వార్ధక్యం, మరణం తప్ప ఈనాడు సర్వాన్ని మానవుడు కంట్రోలు చేయగలశక్తిని పొందాడు. అలాంటి పరిస్థితిలో పాత ఆచారాలు, సంప్రదాయాలు, మూఢవిశ్వాసాలున్న వివాహవ్యవస్థలో మార్పు అనివార్యంకావాలి. అది వ్యక్తిస్వేచ్ఛకు, సమానత్వానికి గొడ్డలిపెట్టుకొరాదు. ఏ సుఖసంతోషాలకైతే, ఏ ఆనందానుభూతులకైతే ఏ సన్నిహిత, సామరస్యాలకైతే వివాహవ్యవస్థపుట్టిందో దాన్ని ధ్వంసంచేవిధానాలు మారక తప్పవు.

# సిక్కుల ధర్మశాస్త్రం : స్త్రీలకు మధ్యయుగాల వారసత్వం

"ఘో! ఘో! సోదరుని చేయిపట్టుకొని మాత్రమే మరల తిరిగిరా" పంజాబు జానపదగాధల్లో అప్పుడేపుట్టిన ఆడపిల్లను న్యాయశాస్త్రరీత్యా ప్రత్యేకంగా నియమితులైన మంత్రసానులు వారి నెత్తిపై పాదంపెట్టి తలను కాలరాస్తూ పాడేపాట ఇది. ఒక కుమార్తెకన్నా హెచ్చుమందివున్న కుటుంబాలలో ఆ పిల్లను గొంతుపిసికి చంపటం మధ్యయుగాలనాడు న్యాయసమ్మతం. దరిదాపు అలాంటిదే ఇటీవల సిక్కుమత ధర్మశాస్త్రం పేరుతో సిక్కు స్త్రీలను చీకటియుగంలోకి నెట్టటానికి జరిగే ప్రయత్నం.

సిక్కులు తాము వేరే ఒక మతానికి చెందివున్నాం కనుక తమకు మతపరమైన శాసనం (Personal Law) కావాలని అలజడి చేస్తున్నారు. అది ఏ క్షణాన్నైనా తిరుగుబాటుగా మారి తమకు ప్రత్యేకమైన ధర్మశాస్త్రం వస్తుందనే నమ్మకంతో ఒక చిత్తుధర్మ శాసనాన్ని అకాలీల సిద్ధాంతకర్త, న్యాయవాదియైన గుర్‌నామ్‌సింగ్‌తిర్ ఇటీవల తయారుచేశారు. దాన్ని న్యాయసంబంధమైన మంత్రిత్వ శాఖచేత పరిశీలింపచేస్తానని ప్రధానమంత్రి హామీ ఇచ్చారు. ఈ చిత్తుశాసనం చట్టరూపమైతే సిక్కుస్త్రీలగతి ఇరాన్, పాకిస్తాన్ స్త్రీలస్థితికన్నా ఘోరంగా మారుతుంది. ఇలా వారిని అన్యాయం చేసేకన్నా వారిని పుట్టగానే హతమార్చటం న్యాయమేమో అనే అభిప్రాయాలుకూడా వచ్చాయి. కనుక సిక్కుస్త్రీలు ముఖ్యంగా భారతస్త్రీలు ఆఖరికి అకాలీపార్టీ చిత్తుశాసనంలోని లోపాలను ప్రజలదృష్టికి తెచ్చి వివరిస్తే చిత్తుశాసనములోని ముఖ్యలక్షణాలు అర్ధమవుతాయి అందులో బహుభార్యాత్వం వారసత్వలోపాలు, విడాకులు, భరణంలాంటివేకాక 'చదరండాజీ' లేక 'క్రేవా' (ఆచారం ప్రకారం ఆమెకు వైధవ్యంవస్తే మామగారి తతిమ్మా కుమారులలో, ఒకని భార్యగా జీవించవచ్చును) లాంటి తిరోగమన భావాలు అనేకం ఆ చిత్తులో దర్శనమిస్తాయి. ఆ చిత్తుశాసనాలు చట్టరూపం తాలిస్తే సిక్కుస్త్రీలు మధ్య యుగాలనాటి పరిస్థితికి పూర్తిగా నెట్టబడతారు. కనుక వాటిని సమీక్షిద్దాం.

సిక్కు మతం మాత్రమే స్త్రీలకు సమానహోదా ఇచ్చిందని తమ దృక్కోణం నుండి డా॥ అత్తార్‌సింగు అభిప్రాయం వెలిబుచ్చాడు. అకాలీల మతనాయకుడు గుర్‌నామ్‌సింగ్‌తిర్ స్త్రీల శ్రేయస్సును తాము విస్మరించటం లేదంటూ తన సిద్ధాంతాల నిలా సూత్రీకరించాడు.

1) ఆమె మతగురువుగా వ్యవహరించవచ్చు.
2) ఇతరులకు మతప్రవేశం చేయుటకు ఆమె అర్హత కలిగివుండవచ్చు.
3) వివాహమాడగానే భర్త ఆస్తిలో సగం ఆమెకు వస్తుంది. కాని విడాకుల సమయంలో ఆమె వ్యభిచారిణి అనిరుజువైతే ఆమెకు ఆ ఆస్తిలో వాటాపోతుంది.
4) ఆమెకు మామగారి ఆస్తిలో వాటావుంటుంది. కాని ఆయన వీలునామాలో ఆమెపేరు ఉదహరించకపోతే రాదు.
5) అత్తమామలూ భర్తా కోడల్ని చంపితే ఆమె ఆస్తి, పిల్లలుంటే పిల్లలకు, లేకపోతే ఆమె తల్లిదండ్రులకు చెందుతుంది.
6) భార్యను చంపిన పురుషుడు మరల వివాహం చేసుకొనుటకు వీలులేదు.
7) ఆమె మరలవివాహం చేసుకుంటే ఆ వాటా (భర్తద్వారా వచ్చిన ఆస్తి)పోతుంది.
8) సోదరులు లేకపోతేనే కూతుళ్ళకు తండ్రిఆస్తిలో భాగం వస్తుంది; ఉంటే ఏ మాత్రమూ రాదు.
9) ఆమె భర్త కోరికలను మన్నించాలి. అతనిని ఆమె ప్రశ్నించడం మొదలు పెడితే ఆమెను భర్త బజార్లోకి నెట్టవచ్చును.
10) సిక్కు స్త్రీలు పురుషులపై ఆధారపడి బ్రతకాలి.
11) బ్రతికివున్నంతకాలం నీతివంతులుగా బ్రతికినట్లు పెద్దలచే రుజువు చేసుకోవాలి.
12) త్రాగడం, జుట్టు కత్తిరించుకోవడం, సిగరెట్లు త్రాగడం స్త్రీలపరంగా నేరం.
13) ఆమె నడవడి నీతిని న్యాయస్థానాలు నిర్ణయించరాదు. 5 గురు పంచాయితీదార్లు తేలుస్తారు. అందులో ఇద్దర్ని ఆమె, ఇద్దర్ని భర్త, ఒకర్ని ఇద్దరూ ఎన్నిక చేసుకోవాలి. పంచాయితీదార్ల తీర్పువల్ల అసంతృప్తి చెందితేనే వారు కోర్టుకు వెళ్ళవచ్చు.
14) వివాహమైన 2 సం॥ పూర్తి అయిన తర్వాతనే, ఉభయుల సమ్మతిమీదనే విడాకులు పొందవచ్చు. కాని పంచాయితీదార్లు సామరస్యాన్ని సాధించటానికి చేసిన ప్రయత్నం విఫలమైతేనే ఆ అవకాశం వుంటుంది.
15) అవివాహిత స్త్రీని ఆమె కోరినంతకాలం తల్లిదండ్రులు, సోదరులు పోషించాలి.
16) విధవలకు మామూలుగా భర్త ఆస్తిలో సగం వస్తుంది. కాని ఆమె వ్యభిచారిణి

అని అత్తమామలు రుజువుచేయగానే ఆ హక్కు పోతుంది. లేక ఆమె మళ్ళీ పెళ్ళాడినా భర్త నుండి వచ్చిన వాటా ఆస్తి పోతుంది.

17) ఒక స్త్రీ నిరాశ్రయురాలైనప్పుడు, ఆమెను భర్త వదలి పెట్టినప్పుడు వివాహితుడైన పురుషుడు ఆమెను వివాహమాడవచ్చును. తన ప్రథమభార్య సమ్మతితోనే అతను మరో స్త్రీని పెళ్ళాడవచ్చును. కాని ఈ మరో భార్యకు అతని వాటా ఆస్తిలో నాలుగవవంతు మాత్రమే చెందుతుంది.

18) ఆమె తన భర్తను అతని దోషనిరూపణ లేకుండా విడాకులిస్తే ఆమెకు ఆ వాటాపై హక్కుపోతుంది.

19) విడాకులు పొందినస్త్రీ మళ్ళీ పెళ్ళి అయ్యేవరకు తిండి, గుడ్డ, వసతులక్రింద మనవర్తి పొందగల అర్హత పొంది వుంటుంది.

20) తిర్ యొక్క చిత్తుశాసనం ప్రకారం 'చదరండాజీ' లేక 'క్రేవా' అంటే చనిపోయిన తన భర్త సోదరుని ఆమె వివాహమాడవచ్చు అనే ఆచారం ధర్మ సూత్రంగా తిరిగి ప్రవేశ పెట్టబడింది. గుర్‌తేజ్‌సింగ్, మంజిత్‌సింగ్, గుర్‌నామ్‌సింగ్‌తిర్ లాంటివారు "సిక్కులు ప్రత్యేక ప్రజానీకం; వారు వేరే జాతి' కనుక వారికి వేరే ధర్మశాస్త్రం తప్పనిసరి అవుతుందని" వాదించారు. సిక్కులకు వేరే ధర్మశాసనం కావాలనేవారు తాము స్త్రీలహక్కులను తీసివేయడంలేదని, పైగా భద్రపరుస్తున్నామంటూ సమర్థించుకొంటున్నారు. 1944 లో హిందూకోడ్‌బిల్లు రైతుల కమతాలను ముక్కలుచెక్కలు చేసిందని, అందువల్లనే తాము స్త్రీలకు తండ్రి ద్వారా సంక్రమించే వారసత్వపు హక్కును తగ్గించామని ఒకసాకుచెప్పారు.

స్త్రీలను అవమానపరిచేది, వారిని తక్కువచూపు చూచేది సిక్కుమతగ్రంధంలో ఏమీలేదని డా॥ అత్తార్‌సింగ్ అన్నాడు. అసలు ప్రచారంలోవున్న సిక్కులకథలన్నీ హిందూపురాణాలనుండి గ్రహించటంవల్లనే దశమగ్రంధంలో పదవగురువు స్త్రీలను గురించి న్యూనతగా ప్రశంగించటం జరిగిందట. అకాలీదళ్ పార్టీ మెంబరు నిర్లేప్‌కేర్ కూడా తల్లిదండ్రుల ఆస్తిలో స్త్రీకి వాటాఇస్తే భూకమతాలు ముక్కచెక్కలై గ్రామాల్లో తగాదాలకు దారితీస్తాయన్నది. అయితే భర్తల ఆస్తిలో భార్యలకు భాగం ఇవ్వటం సముచితమన్నది. బహుభార్యాత్వాన్ని వ్యతిరేకించింది. అసలు సిక్కులకు వేరే ధర్మశాస్త్రానికి ముఖ్యకారణంగా సిక్కులు తాము హిందువులము కామని హిందూన్యాయశాస్త్రం వారి గ్రామీణ జీవితాన్ని చిదాచిదలుచేసి అన్నతమ్ముల మధ్య, అక్కచెల్లెళ్ళమధ్య భేదాలు సృష్టించిందని చెప్తున్నారు.

"ప్రపంచంలోని అన్ని వస్తువులలో ఎంతో విలువైనది ఉత్తమస్త్రీ" మహమ్మద్‌ప్రవక్త ప్రవచనంఇది. మనువుసైతం "ఏ ఇంట స్త్రీ కన్నీరొలుకుతుందో

అ యింట సిరి నిలువదు" అన్నాడు. అలాగే సిక్కుమతం ప్రకారం స్త్రీ పురుషులు సమానులే అంటున్నారు. మరి అన్నిమతాల భాష్యాలు పైకి సమానత్వం అంటూ వివరణలలో భేధాలను పోషిస్తున్నాయి. మహమ్మద్ స్త్రీని మన్నేభూమితో సమాన మన్నాడు. తలాక్‌తో భార్యను బైటికి పంపవచ్చు. ఏకకాలంలో నల్గురు భార్యలు వుండవచ్చు. అస్లే హిందూపురాణాలు స్త్రీకి చాలా నీచస్థాయినిస్తే, క్రైస్తవంలో స్త్రీ 'నీకు విధేయురాలుగా జీవితాంతం వుంటాన'ని ప్రమాణంచేస్తుంది. ఏదినమ్మాలి? న్యాయం ఎక్కడుంది. సిక్కుశాస్త్రం స్త్రీకి పుట్టింటి ఆస్తి వాటా హక్కును కాలరాచింది. నలుగురు అన్నలు పంచుకోంగా లేనిది ఆడపిల్లకి వ్వటానికి వచ్చేటప్పటికి ఆస్థి ముక్కలవుతుందట! భర్త ఆస్తిలో సగం వస్తుందంటూనే తప్పు ఆమెదైతే వాటా రాదట. వ్యభిచారిణి అయితే అప్పుడామెకు ఆ ఆస్తి పోతుందంటే, ఇష్టంలేని భార్యను వ్యభిచారిణి అని ఎలాగైనా రుజువు చేయగలడు. ఆ స్తోమతు పురుషుడికి అందుబాటులో వుంటుంది. అత్తమామలు, భర్త కట్నం కోసం ఆమెను చంపితే ఆమె ఆస్తి ఆమె తల్లిదండ్రులకు పోతుందట. బాగుంది! ఎవరు చంపారో, ఆమే ఆత్మహత్య చేసుకుందో నిర్ణయించేదెవరు? రోజూ ఇన్ని హత్యలు జరుగుతున్నా అన్నీ ఆత్మహత్యలుగా మారిపోవటంలేదా? మామగారి ఆస్తిలో వాటా ఇవ్వతల్చుకుంటే ఇవ్వాలి. కాని వీలునామాలో ఆమెపేరు ఏ మామ రాస్తాడో మనకు తెలియని సత్యంకాదు. భార్యనుచంపిన పురుషుడు వివాహం చేసుకోరాదట! ఇది మరీ హాస్యాస్పదంగావుంది. చంపినట్లు రుజువుంటుందని ఏ స్త్రీ నమ్మలేని పరిస్థితి నేడువుంది.

చిత్తులో అన్నింటికంటే విచారకరమైనది, హేయమైనది, పురుషుడు హెచ్చుసార్లు వివాహమాడవచ్చుననే సూచన. అవి స్త్రీలపాలిటి గొడ్డలిపెట్టు. సమానత్వమన్నప్పుడు పురుషుడు ఎక్కువమందిని వివాహమాడేహక్కు వున్నప్పుడు స్త్రీలుకూడ అలాగే అనేకమంది భర్తలనుపెండ్లాడవచ్చునుగదా! గురుగోవిందసింగుకు బిడ్డలు కలుగక ఆనాడు మరల పెండ్లాడినట్లువుంది. అది ఆనాటి సిద్ధాంతం. మరి నేడు విడాకులు లేకుండా పెళ్ళాడితే నేరం. కనుక మధ్యయుగాల మనస్తత్వం మారక తప్పదు. మరో ఘోరమైన విషయం. 'చదరండాజి' ని తిరిగి అమల్లో పెట్టడం. ఆడమనిషికి కూడా వ్యక్తిత్వం, ఇచ్ఛ, కోరికలు వుంటాయి. విధవరాలైనప్పుడు ఆమె పెళ్ళాడతలిస్తే తనిష్టమొచ్చిన వ్యక్తిని కోరుకుంటుంది. అంతేకాని ఇంట్లో తిరిగే బావను మరిదిని తన అన్నతమ్ముల్లా భావించుకుంటుంది. భర్త పోగానే వారితో దాంపత్యజీవితం గడపటమంటే అది ఆమెపట్ల అనివార్య మవుతుంది. ఏదైనా అది ఆమె ఇష్టాయిష్టాలపై ఆధారపడి వుండాలి. ఒక స్త్రీ

నిరాశ్రయురాలైనా, అనాథ అయినా ఆమె పెళ్ళి లేకుండానైనా జీవిస్తుందికాని సపత్నితో భర్తను పంచుకోటానికి ఏ స్త్రీ ఇష్టపడదు. అది పరిపూర్ణ దాంపత్య జీవితం అనిపించుకోదు. ఇంకా ఇలాంటివే చిత్తుశాసనంలో అనేక లోపాలు, ఘోరాలు వున్నాయి

సిక్కుస్త్రీలు పురుషులపై ఆధారపడి బ్రతకాలని, నీతివంతులుగా జీవించాలని, ఆమె నీతిని న్యాయస్థానాలుకాక పంచాయితీ నిర్ణయిస్తుందని, ఏ ఒక్కరి సమ్మతి మీదనో కాక ఉభయుల సమ్మతిమీదనే విడాకులుకోరవచ్చని, అదైనా రెండు సం॥ రాలు జరగాలని, భర్త కోరికలు మన్నించాలని, ప్రశ్నించేహక్కు ఆమెకు లేదని ఇలాంటివన్నీ పురుషాధిపత్యాన్ని సూచిస్తున్నాయి. ఈ సూచనలలో స్త్రీ పురోభివృద్ధిని, స్త్రీ స్వేచ్ఛా సమానత్వాల్ని, ఆమెవ్యక్తిత్వాన్ని కాంక్షించేవి దరిదాపుశూన్యం. ఇది ఈనాడు సిక్కుస్త్రీలకున్నా (హిందూ శాసనాధికారాలకంటే పరమనీచంగా) చిత్తుశాసనం ఏదైనా మార్పుకోరితే అది ఉన్నతమైనది, ఆదర్శప్రాయమైనదిగా వుండాలికాని మళ్ళీ పరదాల్లోకి, అంతఃపురాల్లోకి నెట్టివేసే ఈ చిత్తుశాసనాన్ని అమలు కాకముందే సోదరస్త్రీలంతా అలజడిచేసి సవరించుటకై తోడ్పడాలి.



# కామన్ సివిల్‌కోడ్ : స్త్రీలు

ప్రపంచంలో ఏ దేశంలోనూ మతాలనుబట్టి శాసనాలుకాని, శిక్షాస్మృతులు (Penal code) కాని లేవు. చట్టాలన్నీ ఆయాదేశ పౌరులకు ఒకే విధంగా వర్తిస్తాయి. కాని భారతదేశంలో హిందూ, ముస్లిం, క్రైస్తవ, పార్శీ మతాలను బట్టి వైవిధ్యంతో కూడిన ధర్మశాస్త్రాలు అమల్లో వున్నాయి. ఇటీవల శిఖులు తమకు వేరే ధర్మశాస్త్రం (Personal Law) కావాలని డిమాండ్ చేస్తున్నారు. ఇలా విభిన్నమైన ధర్మశాస్త్రాలుండటంవల్ల జాతీయ సమైక్యతకు భంగం కలుగుతోంది. అనవసరమైన తేడాలను, విభేధాలను సృష్టిస్తోంది. ఇది మన రాజ్యాంగంలో పొందుపరచిన సెక్యులర్ భావనకు, లౌకికరాజ్య విదానానికి విరుద్ధం. అంతేకాదు కొన్ని మతాలవారికి హెచ్చు హక్కులుండటంవల్ల ప్రజాస్వామ్య విధానానికే గొడ్డలిపెట్టు. ఇప్పటికే ఈ దేశాన్ని కులాలు అడ్డంగా చీలిస్తే, మతాలు నిలువుగా చీల్చి చెల్లాచెదరు చేశాయి. విశ్వమానవ భావన లేకపోగా మనిషికీ మనిషికీ కులాలు, మతాలు, భాషలు, ప్రాంతాలు ఆచారవ్యవహారాలు అడ్డుగోడలై నిలిచాయి. మత దురహంకారంవల్ల మానవ మారణహోమం జరుగుతూనేవుంది. హత్యలు, ఖూనీలు, గృహదహనాలు ప్రళయతాండవం చేస్తున్నాయి. మతసూత్రాలతో వున్న విధినిషేధాలు విలయతాండవంచేస్తూ విధ్వంసకాండకు మార్గదర్శకమైనాయి. మతాలమధ్య సహపంక్తి భోజనాలు, వివాహాలు నిషిద్ధమైనాయి. మా మతం గొప్పదంటే మా మతసూత్రాలు అద్వితీయమంటూ కలహాలాడటంవల్ల మానవత్వం పోయి దానవత్వం దర్శనమిస్తోంది. మత విభేదాలు శాంతిసౌభాగ్యాలకు గొడ్డలిపెట్టు. కనుక మత సామరస్యం ఎలా సాధించాలి? దానివల్ల హెచ్చుతగ్గులు నశించి ఐక్యతాభావం కలుగుతుందా? దానికి మార్గం వున్నదా? వుంటే ఎలా? ఏం చెయ్యాలి? అనేవి నేటి చర్చనీయాంశాలు అయినాయి.

మతసామరస్యానికి, దేశపటిష్టతకు 'కామన్ సివిల్‌కోడ్' తప్ప గత్యంతరం లేదనే భావన ప్రబలంగా వుంది. ఒకే వ్యవహార సంహిత (Common civil code) అంటే ఏమిటి? అది ఏందుకు ప్రవేశపెట్టాలి? అది అమల్లో లేనందువల్ల నష్టాలేమిటి? అనేదానికి నేడు అమల్లో వున్న మతపరమైన శాసనాలు,

(పర్సనల్ లాస్) వాటి స్వరూప స్వభావాల వివరణలు తెలిసికోవటం అవసరం అయింది. ముఖ్యంగా మతపరమైన చట్టాలలో స్త్రీలహక్కులను ఎరుకపర్చటం చాలా అవసరం. వాటినిబట్టి ఆమె స్థాయిని, హోదాను నిర్వచించవచ్చు. మన చట్టాలు స్త్రీ పురుష తారతమ్యాన్ని నిర్దేశిస్తున్నాయా? సమానత్వాన్ని ఆకాంక్షిస్తున్నాయా? ఈ ప్రశ్నలకు శాసనాలలో చక్కని సమాధానాలు దొరుకతవి. వివాహం, విడాకులు, భరణం, దత్తత, వారసత్వం, సంరక్షకత్వంలాంటి కొన్ని మతపరమైన శాసనాలలో స్త్రీలను అవమానపరిచే దుర్లక్షణాలు చాలా వున్నాయి. అవి స్త్రీలను ఎంతగా బాధిస్తాయో రుజువు చేసుకోవచ్చు. వాటిలో స్త్రీ పురుష అసమానత్వం, వివక్ష చాలా వుంది. అంతేకాక అవి స్త్రీలయొక్క న్యాయమైన మానవ హక్కులను కాలరాయడంకూడా గమనార్హం. మతపరమైన ధర్మశాస్త్రాలలో ఘోరమైన దురన్యాయాలను కొన్నింటిని గమనిద్దాం.

బాల్యవివాహ నిషేధశాసనం 1929 లో వచ్చింది. కాని బాల్యవివాహం చెల్లదని హిందూవివాహశాసనం ప్రకటించలేదు. అందువల్ల వధువుకు 18, వరునికి 21 ఏండ్లు లోపున పెళ్ళిళ్ళు జరుగుతూనే వున్నాయి. తద్వారా తెలిసీ తెలియని ఆడపిల్లలకు అన్యాయం జరుగుతోంది. మరి బాల్యవివాహాలరద్దును శాసనం చేసే ఆలోచన వున్నదో లేదో! బాల్యవివాహం జరిగిన ముస్లింవధువుకు దాంపత్యజీవితంలోకి ప్రవేశించకముందు ఈ పెళ్ళి వద్దనే హక్కుమాత్రం ఇచ్చారు. కాని ధైర్యంగా ముందుకొచ్చి ఆ మాట కోర్టులో చెప్పుకోగల ముస్లింకన్యలున్నారా అనేది మౌలికమైన ప్రశ్న. ఇక పార్శీలలో 14 ఏళ్ళ పిల్లకు, 16 ఏళ్ళ బాలునికి వివాహం జరిగితే పార్శీచట్టం ప్రకారం కోర్టు ఆ వివాహాన్ని అమలుపరచదు. కోర్టుకెళ్ళి వివాహం రద్దుకోరేవారు అలాంటి వివాహాలే చేసుకోరు; చెయ్యరుకూడా.

హిందూవివాహం విధిగా రిజిష్టరు చేసుకోనక్కరలేదు. కొన్నిసమయాల్లో భర్త తానా పిల్లను చేసుకోలేదంటే కేవలం పెద్దమనుష్యుల సాక్ష్యమే ఆధారమయ్యే "రిస్కు" వుంది. 1978 వరకు హిందూవివాహశాసనం మారుతూనేవున్నా విధిగా రిజిష్టరు కావాలనేమాట శాసనంలోలేదు. క్రైస్తవవివాహం విధిగా చర్చిలో జరగాలి; మతగురువు వ్రాసే రిజిష్టరులో నమోదుచెయ్యాలి. క్రైస్తవవివాహంలో భర్త ఆజ్ఞకు లోబడి వుంటానని వధువు ప్రమాణం చెయ్యాలి. ఇది బానిస మనస్తత్వ చిహ్నంకాదా? ముస్లింల వివాహం "నికా" రిజిష్టరులో వరుడు సంతకంచెయ్యాలి వధువుతరపున వలి (ఆమెదగ్గరబంధువు) సంతకంచేస్తే సరిపోతుంది. అంటే ఆమెకు విలువలేదన్నమాట. ఇలా మతపరమైన శాసనాల్లో స్త్రీ హోదా విస్మరించబడ్డది.

ఏకకాలంలో ముస్లింపురుషుడు నలుగురు భార్యలను కలిగి వుండవచ్చునని 'షరియత్‌లా' నిర్దేశించింది. ఇది మానవ నైజానికే వ్యతిరేకం. భర్తల అదుపు ఆజ్ఞలో అణగిమణగి వుండే ముస్లింస్త్రీల దైన్యావస్థ వర్ణనాతీతం. తనంత తానుగా 'తలాక్' ఇచ్చి భార్యకు ముస్లింపురుషుడు మాటతో విడాకులివ్వవచ్చు. 'తలాక్' కార్డుమీద వ్రాసి పంపవచ్చు. ఆఖరికి కోపోద్రేకంలో అన్నా ఆ వివాహం రద్దు అవుతుంది. మరి భార్యమాత్రం కోర్టులో దావా వేసుకోవాలి. అది చాలా వ్యయ ప్రయాసలతో కూడినపని. ముస్లింలా ప్రకారం 'ఇద్దత్' (గడువు) మూడుమాసముల వరకే విడాకులు పొందిన స్త్రీకి భరణం లభిస్తుంది. అంటే కొద్దిపాటి ధననష్టంతో భార్యను గెంటివేసేహక్కు దురాహంకారియైన ముస్లింపురుషుడికి లభిస్తోందన్నమాట.

క్రైస్తవుల విడాకులచట్టం చాలా ఘోరంగాను, పక్షపాతంతోను నిండివుంది. తన భార్య వ్యభిచరించిందని భర్త రుజువుచేస్తే సరిపోతుంది. కాని ఆమెమాత్రం భర్త సన్నిహిత బంధువులతో వ్యభిచరించాడని, లేక మరో భార్యను స్వీకరించి ఆమెతో వ్యభిచరించాడని, లేక మరోస్త్రీని పెళ్ళాడి వ్యభిచరించాడని, వ్యభిచరిస్తూ తనను హింసించాడని, లేక అదనంగా 2 సం॥ రాలుపైగా తన బాగోగులు చూడలేదని ఏదో ఒకదానిని రుజువుచేస్తేతప్ప ఆమెకు విడాకులురావు. ఇది చాలా అసాధ్యం. కనుక క్రయిస్తవస్త్రీలు నోరుమూసుకొని, గ్రుడ్లనీరు తుడుచుకొని పడివుంటున్నారు.

వివాహితులలో ఎవరో ఒకరు ఈ దాంపత్యజీవితం ఇక కొనసాగదని, సాగించలేమని నిర్వంద్వంగా ప్రకటిస్తే కోర్టువిడాకులు ప్రసాదించే అవకాశమే నేటికి ఏ చట్టంలోనూ లేదు. ఆఖరికి 1954 లోని ప్రత్యేక వివాహచట్టంలోకూడా లేదు. దీనివల్ల స్త్రీలు కష్టనష్టాలపాలవుతున్నారు. పిటిషన్ ద్వారా హిందువులు విడాకులు పొందవచ్చు. ముస్లింవనిత దావా వెయ్యాలి. అదేపనికి, కాని క్రైస్తవవివాహం రద్దు కావాలంటే ముగ్గురు జడ్జీలతో ఏర్పడిన ధర్మాసనం మాత్రమే చెయ్యాలి. దీనివల్ల జాప్యం, కాలహరణంకూడాను. విడాకుల దావాలలో పార్టీలను ప్రత్యర్థులుగా పరిగణించడం, దోషులెవరో నిర్ధారించాలని ప్రయత్నించడం ముఖ్యమైనలోపాలు. జపాన్, రష్యా, చైనాలలో కుటుంబన్యాయస్థానాలద్వారా పార్టీలమధ్య రాజీ కుదర్చటానికి, సామరస్యం, సఖ్యత నెలకొల్పటానికి ప్రయత్నిస్తుంటే మన దేశంలో ప్రత్యేక న్యాయస్థానాల లేమివల్ల యువతులు కోర్టుకెళ్ళ లేక, ఖర్చులు భరించలేక, బోనులో నిలబడి చెప్పుకోలేక జీవచ్ఛవాల్లా పడివుంటున్నారు.

ఇక దత్తత సంరక్షకత్వాల విషయంలో భార్య అనుమతితో హిందూ పురుషుడు తనకు దత్తుపొందే అధికారం చట్టంప్రకారం పొందాడు. కాని భర్త సమ్మతి

పొంసెహూడా భార్య తనకు దత్తు చేసుకోరాదు. విధవరాలు, విడాకులు పొందిన స్త్రీ అవివాహితలు మాత్రమే దత్తు చేసుకోవచ్చు. ఇస్లాంలా ప్రకారం అసలు దత్తతకు అవకాశమేలేదు. 1972 దత్తతకు బిల్లుపెడితే సనాతన ముసల్మానులు చట్టం కాకుండా ఆపగలిగారు. మైనరు పిల్లలకు గార్డియన్‌గా ముస్లింలలో భర్త మాత్రమే అర్హుడు. ఆమె విధవరాలైనప్పటికూడా తాత లేక అతని విల్లులో ఉదహరింపబడ్డ వాడే మైనరు ఆస్తికి సంరక్షకుడు. ఇలాంటి నైచ్యస్థితి ముస్లిం స్త్రీ అనుభవించటం సహించరాని విషయం.

అన్నింటికన్నా ముఖ్యమైనది వారసత్వం. అన్నిమతాల స్త్రీలను అన్యాయం చేసే చట్టాలు ఇందులో వున్నాయి. విధవరాలైన క్రైస్తవస్త్రీకి చాలా అన్యాయం జరుగుతోంది. సంతానంవుంటే ఆమెకు భర్త ఆస్తిలో 3 వ వంతు వాటా, లేకపోతే సగంవాటాకు ఆమె అర్హురాలు. బిడ్డలు లేనప్పుడుకూడా ఆ తల్లికి భర్త ఆస్తిలో సగం చెందుట హాస్యాస్పదమేకాక పురుషాధిక్యతనుకూడా చాటుతోంది. పార్శీ వివాహ శాసనం 1936 నాటిది. విడాకులు, వారసత్వవిషయాలలో పార్శీలా చాలా వెనుకబడి వుంది. దంపతుల మనస్తత్వాలు కలువలేదనికాని లేక ఉభయుల సమ్మతిమీదకాని విడాకులు పొందేవీలు అందులో లేదు. వారసత్వంలోకూడా, ఒకకొడుకూ కూతురూ వున్న పార్శీ విధవరాలికి కూతురి వాటాకు రెండింతలుగా ఆమెకు, ఆమె కుమారునికి సంక్రమిస్తాయి. అలాగే ఒకపార్శీ చనిపోయేనాటికి ఉన్నఆస్తిలో అతని కొడుకులో సగభాగం అతని తండ్రికివస్తే, అతని కూతురివాటాలో సగం అతని తల్లికి వస్తుంది. తండ్రిచనిపోతే ఆస్తిలో కూతురికి సమానవాటాలేదు. కనుక పార్శీ వారసత్వ శాసనంలో ఆడవారికి న్యాయం జరగటంలేదు.

హిందూలాప్రకారం పిత్రార్జితపు ఆస్తిలో జన్మతః కుమారునికున్న ఆస్తి హక్కు కుమార్తెకు లేదు. 1929 నుండి 56 వరకు ఎన్నో పర్యాయాలు వారసత్వచట్టం మారినా మితాక్షర విధానంమాత్రం మారలేదు. ఏ భార్యఅయితే భర్త ఆస్తిని అష్టకష్టాలుపడి నిలుపుతుందో, అభివృద్ధిచేస్తుందో ఆమె విధరాలైనప్పుడు ఆమెకు న్యాయమైన వాటారాదు హిందూ వారసత్వ చట్టపరంగా. 1946 లో హిందూకోడ్‌బిల్లు చర్చకొచ్చినప్పుడు సనాతన హిందువులు విజయవంతముగా దాన్ని వమ్ముచేసి తద్వారా స్త్రీ జాతికి ఘోరఅపచారంచేసి సంతోషించారు. హిందూకోడ్‌బిల్లు ముక్కచెక్కలై నీరుకారిపోయింది.

ఇస్లాంలా ప్రకారం సంతానం లేకపోతే తల్లికి $\frac{1}{4}$వంతు ఆస్తి వస్తుంది. బిడ్డలున్న తల్లికి $\frac{1}{8}$వంతు సంక్రమిస్తుంది. ఇదిసర్వహక్కులతో చెందుతుంది. మిగతా

ఆ స్తిలో కూతుళ్ళకు రెట్టింపు కొడుకులకు చెందుతుంది. కనుక భార్యకు తక్కువ వాటా ఒకటి, కొడుకువాటాలో కూతురికిసగం చెందటం మరొకటి. ఈ రెండు విధాల ఇస్లాంస్త్రీకి న్యాయం జరగటం లేదు. ఇలా రకరకాలైన అడ్డంకులు తేడాలు తరచిచూస్తే చాలా వుంటాయి స్త్రీలకు వారసత్వ చట్టాలలో. పార్శీల ధర్మశాస్త్రం కొంత మార్పుపొందినా పూర్తిగా తృప్తి కలిగించే మార్పు రాలేదు. మొత్తంమీద వారసత్వ చట్టాల్లో హిందూస్త్రీకి పెద్దగా లాభించలేదు. ఇస్లాంలోనూ అంతే; కాకపోతే క్రైస్తవశాసనంలో కూతురివాటాకు, కొడుకువాటాకు తేడాలేదు. సమానత్వం వున్నా లాభాలు తక్కువ. అలాగే సిక్కుస్త్రీల వారసత్వహక్కుల్లో చాలా అన్యాయం జరుగబోతుంది.

సిక్కులు తాము వేరే ఒక మతానికి చెందివున్నాం కనుక తమకుకూడా మత పరమైన శాసనం (Personal law) కావాలని అలజడి చేస్తున్నారు. అది ఏక్షణాన్నైనా తిరుగుబాటుగామారి తమకొక ప్రత్యేక ధర్మశాసనం వస్తుందనే నమ్మకంతో ఒక చిత్తు ధర్మశాసనాన్ని తయారుచేశారు. అందులో ముఖ్యమైనవి కొన్ని పరిశీలించాలి. సోదరులు లేనప్పుడు మాత్రమే తండ్రి ఆస్తిలో కూతురికి భాగముంటుంది. భర్త ఆస్తిలో సగం భార్యకు వస్తుంది కాని ఆమె పతిత అని ఋజువైతే ఆ వాటా పోతుంది. అలా ఋజువుచేయడం అంత కష్టమేమీకాదు. ఆమె మరల వివాహమాడినా ఆ భాగం ఆమెకు పోతుంది. సిక్కుస్త్రీలు జీవితాంతం నీతివంతులుగా బ్రతికినట్లు ఋజువు చేసుకోవాలి. జుట్టుకత్తిరించుకోవటం, త్రాగటం లాంటివి స్త్రీలకు నిషిద్ధాలు. భార్యలు భర్తలకోరికలు మన్నించాలి. అతనిని ప్రశ్నించే అర్హత భార్యకులేదట. ప్రశ్నిస్తే ఆమెను వెళ్ళగొట్టవచ్చట. ఆమె అవినీతి పరురాలో కాదో పంచాయితీ పెద్దలు మాత్రమే నిర్ణయిస్తారు కాని కోర్టుకాదు. "చదరండాజీ" లేక (క్రేవా) అనేది చిత్తులో రాశారు. అంటే మనువు ప్రతిపాదించిన వియోగంలాంటిది – చనిపోయిన భర్త సోదరునిద్వారా సంతానం కనమని మనువు చెప్పాడు. మళ్ళీ పెళ్ళాడమని చిత్తులో రాశారు శిక్కులు – కనుక ఆమె తిరిగి వివాహమాడవచ్చు. ఇదికాక బహుభార్యాత్వంలాంటిదికూడా రాయబడింది. అంటే అనాథ స్త్రీ కాని, నిరాశ్రయురాలైన స్త్రీ కాని, భర్త తిరస్కృతిగాని అయిన స్త్రీని మొదటిభార్య ఒప్పుదలపై పెండ్లాడవచ్చునట. మొదటిఆమెకు $\frac{1}{2}$ భాగం ఆస్తివస్తే ఈ తరువాత స్త్రీలకు $\frac{1}{4}$ వాటా వస్తుందని రాశారు. ముఖ్యంగా క్రేవాపద్ధతి చాలా ఘోరం. విధవరాలు పెళ్ళాడతలిస్తే తనిష్టమొచ్చినవానిని వివాహమాడుతుంది కాని చట్టపరమైన బావగార్ని, మరదిని ఎలా వివాహమాడుతుంది? రోజూ ఇంట్లో

తిరుగుతున్న అన్నలాంటి భావం వున్నవాడిని భర్తగా స్వీకరించలేదు. కనుక మధ్యయుగాలనాటి అనాగరికలక్షణాలు సిక్కుస్త్రీలపట్ల చూపటం చాలా ఘోరమే కాక ఆమెవ్యక్తిత్వాన్ని నేలరాయడంకూడా అని చెప్పాలి.

మతపరమైన చట్టాలలో కొన్ని ఘోరమైన దురన్యాయాలను చర్చించడం జరిగింది. వీటిని గమనించాము. ఆయాధర్మశాస్త్రాల హింసాత్మక స్వభావము, దుర్లక్షణాలు స్త్రీ పురుష అసమానత్వం, తేట తెల్లమయినాయి. మరి వీటిని మార్చి ఆధునికవిధానాల్లో పయనిద్దామా? అసలు ఈ వైవిధ్యంగలచట్టాలను ఎవరునిర్మించారు? వాటికి ఆధారాలేమిటి? అంటే హిందూధర్మశాస్త్రానికి ఆధారగ్రంథాలు, సిద్ధాంతాలు రెండువేల ఏళ్ళనాటివి. గృహ్యాసూత్రాలు, ధర్మశాస్త్రాలు, స్మృతులు లాంటివి పురాతన ఋషులు రాశారు. వారిలో మనువు ముఖ్యుడు. అలాంటి మనుధర్మ శాస్త్రాల ఆధారంతో, నాటి ఆచార వ్యవహారాలను స్ఫురింపజేస్తూ చిత్రీకరించినవే మన ధర్మశాస్త్రాలన్నీ. అందువల్లె 1948 వరకూ హిందువులకు బహూభార్యాత్వం ఆచారమయింది. బానిసత్వం, అర్ధబానిసత్వం, భూస్వామ్యం, జమిందారీ విధానాల నుండి, సమాజ పరిణామదశలో, ఈ విభిన్న ధర్మశాస్త్రాలు పుట్టాయి. ఆనాటికవి సంస్కరణలని భావించవచ్చు. మహమ్మద్ క్రీ॥ శ॥ 661 లో ఇస్లాం స్థాపించే నాటికి పురుషుడు వేల భార్యలను కలిగి వుండవచ్చు. అప్పుడాయన నలుగురిని పెండ్లాడవచ్చని సూత్రీకరించాడు. అది ఆనాటికి గొప్పమార్పు. మరి ఈనాడో? 662 లో పుట్టిన ఖుర్ఆన్ సూత్రాలు, షరియత్‌లా నేటికి ఆమోద యోగ్యాలా! బైబిలు పుట్టి 1900 ఏళ్ళయింది. క్రైస్తవ ధర్మశాస్త్రాన్ని క్రోడీకరించిన సూత్రాలు నాటివి. మరి ఈ శాస్త్రాలన్నీ కాలగమనంతో మౌలికమైన మార్పులు చెందాయా? లేదు. నాడు హిందూమత ధర్మకర్తలు, ముస్లిం మౌల్వీలూ, ఉలేమాలు, క్రైస్తవ బిషప్పులు, కార్డినల్సు, పోపులాంటివారు చిత్తశుద్ధితో సిద్ధాంతాలు ప్రవచించినా, చట్టాలు చేసినా నాటి కాలానికి అవి చెల్లవచ్చు. నేడు సాంఘిక ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో ఎన్నో మార్పులు, మరెన్నో చేర్పులూ, కూర్పులూ వచ్చాయి. ఈ నాటి మానవుడు వి శ్వ మా న వు డై నా డు. ఎన్నో అసాధ్యాలు ఈనాడు సాధ్యాలయినాయి. నేడు చంద్రగోళాన్ని చుట్టి వస్తున్నాం. ఇన్నిరంగాల్లో మార్పు లొచ్చినప్పుడు ముఖ్యమైన మన మత ధర్మశాస్త్రాలు ఎందుకు మారకూడదు? మన శిక్షాస్మృతి (Penal code) క్రిమినల్ ప్రొసీజరుకోడ్ భారత పౌరులందరికీ వర్తిస్తున్నపుడు, హంతకుడు, దొంగ, ఇతరనేరస్తులకు ఒకేశిక్ష వున్నప్పుడు భూమిపన్ను, వాణిజ్యపన్ను, భూపరిమితి శాసనం, 'కష్టమ్సు', 'ఎక్సయిజు' లాంటి

వన్నీ అన్ని మతాలకు వర్తించేటప్పుడు ధర్మశాసనాలు వేరువేరుగా ఎందుకుండాలి? ఇతర అభ్యుదయ దేశాలలో మతాలు వేరైన శాసనాలలోమాత్రం మార్పులేదు. 1857 లో సిపాయితిరుగుబాటు తర్వాత బ్రిటీష్ వైఖరిలో మార్పు వచ్చింది. 1856 లో సతీసహగమన నిషేధచట్టం తర్వాత పౌరుల మత విషయాలపై బ్రిటీష్‌వారు విముఖత వహించారు. తదుపరి ఛాందస మతశక్తులు, మత స్వప్రయోజన పరులు ప్రతిఘటించడంవల్ల మార్పురాలేదు.

భారతరాజ్యాంగం 44 వ ఆర్టికల్ భారతప్రజల రక్షణకొరకు కామన్ సివిల్‌కోడ్ పెట్టమని (The state shall endeavour to secure for citizens a Uniform Civil Code) నిర్దేశించింది.

1948 - 49 లో (కాన్‌స్టిట్యూయెన్ట్ ఎసెంబ్లీలో) రాజ్యాంగ నిర్ణయ సభలో కామన్ సివిల్‌కోడ్ చర్చకొచ్చినపుడు "దీన్ని ప్రవేశపెడితే మతపరమైన చట్టాలను రద్దుచెయ్యాలిగదా; దానికి మతస్థులు వ్యతిరేకిస్తారేమో" నని సభ్యులు భయపడ్డారు. కె. ఎం. మున్షీ ఆస్తిసంక్రమణ, వారసత్వం లాంటి లౌకిక వ్యవహారాలకు సంబంధించినవి కనుక మత ధర్మశాస్త్రాలు వాటిని పవిత్రమైనవిగా భావించాల్సిన పని లేదని కామన్ సివిల్‌కోడ్‌ను పెట్టమని వాదించాడు. డా॥ అంబేద్కర్ తన అభిప్రాయాన్ని మార్పుకు అనుకూలంగా చెప్పాడు. "చాలావరకు అందరికీ వర్తించే శాసనాలను పీనల్‌కోడ్, మరియు క్రిమినల్‌కోడ్, సేల్సుటాక్సులాంటివి పెట్టుకొన్నాం. కాకపోతే వివాహం, వారసత్వం లాంటి విషయాలలో విభిన్న ధర్మశాస్త్రాలున్నాయి. మతధర్మశాసనాలలో వైవిధ్యం వున్నందువల్ల వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య వివక్ష చూపరాదనే మౌలిక సూత్రానికి భంగం వస్తోంది. ఉ॥ హిందూ, క్రైస్తవులు ఏకపత్నీవ్రతులుగా వుండవలసివుంది. కాని ముస్లిం నలుగురిని పెండ్లాడవచ్చు. ఇది వివక్షకాదా?" అని ఆనాడు అంబేద్కర్ ప్రశ్నించాడు. ఆనాడు జరిగిన ఈ వాదనలకు ఈనాటికీ విలువవుంది. లౌకికరాజ్యమూ, సైన్సు, ఆధునికతలపై నొక్కిపెట్టే ఈ శతాబ్దపు చివరికాలంలో ఇంకా మతధర్మ శాసనాలను విడివిడిగా వుంచడం అందులో స్వరాజ్యం వచ్చిన 37 సం॥ తర్వాతకూడా ఇలా జరగడం విడ్డూరంకాదా?

దేశస్త్రీలస్థితిని విచారించి, వారి స్థితిని మార్చటానికి 1975 లో ఒక "స్టేటస్ కమిటీ" ని నియమించింది భారతప్రభుత్వం. ఆ కమిటీవారు కొన్ని సిఫార్సులతో ఒక నివేదికను సమర్పించారు. అందులో వారు "పురుషుడికి, స్త్రీకి మధ్య వివక్ష

చూపే మతధర్మ శాసనాలను ఇంకా కొనసాగనివ్వటం ప్రజల మౌలిక హక్కులకు వ్యతిరేకం. భారతరాజ్యాంగ ఉపక్రమణికలో పేర్కొనబడిన సమానత్వ సిద్ధాంతానికి వ్యతిరేకం. అంతేకాక జాతీయ సమైక్యతా భావానికి విరుద్ధం. కనుక కామన్ సివిల్‌కోడ్‌ను వెంటనే అమలుపర్చాలి." అని సిఫార్సు చేశాయి.

హిందూ స్త్రీ పట్ల అసమానత్వాన్ని ఛేధించుటకు, ముస్లిం స్త్రీ న్యాయమైన హక్కులకోసం, క్రైస్తవస్త్రీకి జరిగే అవమానాల నిర్మూలనకు సర్వులకూ న్యాయాన్ని చేకూర్చగల, విశ్వమానవ హక్కులపై ఆధారపడే, న్యాయం, సమదృష్టి, నైతిక భావాలపై ఆధారపడే ఒకే తరహా వ్యవహార సంహితను వెంటనే ప్రవేశపెట్టుటకు ప్రభుత్వము, ప్రజలూ, మతస్థులుకూడా ఉద్యమించుట అవశ్యకర్తవ్యము.



# కన్య తల్లి అయితే?

అవివాహిత మాత అయిందనగానే అదిరిపడతారు. ఆందోళనపడతారు. అసహ్యించుకుంటారు. అవివాహిత స్త్రీకి మాతృత్వాన్ని పొందేహక్కు వుందా? లేదా? వివాహంద్వారా మాత్రమే స్త్రీ సంతానాన్ని కనాలా? లేక వివాహబంధం లేకుండాకూడా కనవచ్చా? మోసగింపబడ్డ స్త్రీ తన జీవితాన్ని ఎలా మలుచుకోవాలి అనేవి మౌలికప్రశ్నలు. అసలు అవివాహితమాతపట్ల, ఆ బిడ్డపట్ల ఈ సమాజం ఎందుకింత క్రూరంగా ప్రవర్తిస్తోంది? సామాజిక నీతిపరంగాను, వ్యక్తిపరంగాను ఈ సమస్యను గురించి అభిప్రాయాలు వెలిబుచ్చేముందు దీన్ని ఎన్ని దృక్కోణాలనుండి పరిశీలించవచ్చునో ఆలోచించాలి.

ఇంతవరకు వివాహం ద్వారానే స్త్రీ సంతానం పొందాలని, తన కన్యాత్వాన్ని భర్తకుమాత్రమే సమర్పించాలనే భావం ప్రజల్లో, సమాజంలోకూడా ప్రబలంగా వుంది. ఆచారాలు, సంప్రదాయాలు దానికే విలువఇచ్చాయి. మతాలన్నీ కన్య తల్లికారాదని సూత్రీకరించాయి. ఈ పరిస్థితుల్లో వివాహబంధాన్ని త్రోసిరాజనే స్త్రీలున్నప్పుడు, వారు మాతృత్వాన్ని పొందేహక్కు వుందా లేదా అనే మరో మౌలికప్రశ్న ఎదురౌతుంది. మరోవిధంగా ఆలోచిస్తే ఆమె కనబోయే శిశువుయొక్క బాగోగుల దృష్ట్యా ఆ మెస్థితిని పరిశీలించాలి. ఈనాడు వరకట్నాలసమస్య విలయతాండవం చేస్తోంది అమ్మాయి అనాకారి అనో లేక వికలాంగురాలనో లేక కుటుంబం పరువూ ప్రతిష్ట లేనిదనో అంటూ కన్యలను నిరసిస్తున్నారు. ఆస్తి, హోదా లేని యువతులు పెళ్ళికాక కన్యలుగానే వుండిపోతున్నారు. కన్యలు తగిన తాహతులేక, అందంలేక, ఏ రెండో పెళ్ళివాణ్ణో, ముసలివాణ్ణో పెళ్ళాడలేక జీవితాంతం అవివాహితులుగా బ్రతకాల్సిన పరిస్థితుల్లో వున్నారు. ఇది కళ్ళెదుట తాండవమాడే పచ్చినిజం. యుక్తవయస్సులో పెళ్ళికాని ఆడపిల్లలకు ఏవో పేర్లుపెడుతూ వుంటారు. తర్వాత వార్ని పెళ్ళాడే నాథుడే వుండడు. మరి వారు మోడుగా జీవించాల్సిందేకదా! అది చాలక అన్నతమ్ముల అండనచేరి ఈసడింపులతో జీవితాల్ని కడతేర్చుకోవాలి. మరి వీరు తల్లులు కావడాన్ని ఏ మతమూ, ఏ సమాజమూ అంగీకరించడంలేదు. ఎందుకు?

ఇక్కడొక ముఖ్యమైన ప్రశ్న ఉదయిస్తోంది. స్త్రీకి మాతృత్వ వాంఛ వుండదా? వుండడం అసహజమా? వుంటే ఎలా కనాలి అనేవి మరికొన్ని ప్రశ్నలు. అసలు కనదల్చి పురుషసంపర్కంతో కంటుందో, కృత్రిమ గర్భధారణవల్ల కంటుందో అది ఆమె ఇష్టంపై ఆధారపడివుంటుంది. కాకపోతే లక్షలసంఖ్యలో అనాథలున్నారు వారిని పెంచుకోరాదా అంటూ దీర్ఘాలు తీస్తారు; సూత్రాలు వల్లెవేస్తారు. బాలవిధవలనుసైతం ఆజన్మాంతం కఠోరబ్రహ్మచర్యం పాలుచేసిన ఈ మన సమాజం అవివాహితస్త్రీలు తల్లులుకావటం సహించదు. సంతానాభివృద్ధిని - అందులో పురుష సంతానాభివృద్ధిని హిందూమతం నిర్దేశించినా, స్త్రీలలో విధవలను, విడాకులు ఇవ్వబడినవారిని మరల వివాహం చేసుకోవటానికి ఇస్లాం, క్రైస్తవ మతాలు ఆమోదించినా కన్యలు - అంటే అవివాహితలు తల్లులు కావడాన్ని ఈ మూడు మతాలు ఆమోదించవు. వివాహంద్వారా కలిగే సంతానమే సక్రమ సంతానంగా పరిగణించటంవల్ల ఇలాంటి వైఖరి ఏర్పడుతోంది.

నవమాసాలు మోసి కనేది స్త్రీ. గర్భధారణ విషయంగా పురుషుల భాగస్వామ్యం పిసమంతకూడాలేదు. పిండోత్పత్తి విషయంలో అతని ప్రతిపత్తివున్నా బరువు బాధ్యతలు మోసేది, రక్తమాంసాలు పంచిఇచ్చేది స్త్రీయే. ఆమెపాత్ర అద్వితీయమైనది. కనుక పిల్లల్ని కనాలన్నా వద్దనుకున్నా ఆమెకు పూర్తిస్వేచ్ఛ వుండాలి. అలాగే తన బిడ్డతండ్రి తన భర్తగా తనతో కాపురం చెయ్యాలా అక్కర్లేదా అని తేల్చుకోవలసిందికూడా స్త్రీయే.

వివాహంయొక్క లక్ష్యం కేవలం సంతానప్రాప్తి మాత్రమే కాదు. స్త్రీ పురుషుల మధ్య ప్రేమ అనురాగం, పరస్పర గౌరవం, ఆదర్శాలలో సామ్యం లక్ష్యాలలో సన్నిహితత్వం, అలవాట్లలో వైరుధ్యంలేమి, దైనందిన చర్యల్లో మైత్రి, సఖ్యత సామరస్యం సర్దుకుపోయ్యే మనస్థత్వం వున్నప్పుడే వారు భార్యాభర్తలుగా ఒక ఇంటిలో కాపురం చేయగలుగుతారు. అప్పుడే ఆమె వాస్తవానికి ఇల్లాలవుతుంది. ఇన్ని లక్ష్యాలు ఉన్న పురుషుడు తటస్థించనప్పుడు కేవలం సంతానంకోసమే ఆమె వివాహమాడితే ఆమె తన జీవితాన్ని చేజేతులా చిదిమివేసినట్లవుతుంది. ఇక అవివాహిత రెండువిధాల తల్లికావచ్చు. తనకు సర్వే సర్వత్రా నచ్చకపోయినా హెచ్చుగా నచ్చిన పురుషునితో తాత్కాలికంగా దాంపత్యలైంగిక సంబంధం ఏర్పరచుకొని గర్భందాల్చటం ఒకపద్ధతి. అలాకాక కృత్రిమ పద్ధతులద్వారా పురుషసంపర్కం లేకుండానే గర్భం తాల్చటం రెండోది. ఏ పద్ధతి అవలంబించినా రెండింటికీ సామాన్యమైన లక్షణం ఒకటే - అదే అవివాహితమాత కావటం.

ఒక స్త్రీ పెళ్ళికాకుండా పిల్లనుకంటే సమాజం, ప్రస్తుతం, ఆమెను ఈసడిస్తుంది. ఇక్కడ కీలకమైనా ప్రశ్న ఏమంటే తల్లి చేసింది తప్పని ఎంచినా, పిల్లను అక్రమ సంతానమని నిరసించడం సబబుకాదు. ఈ ప్రపంచంలో పుట్టటం పుట్టకపోవడం ఆ శిశువు చేతిలో లేనప్పుడు ఆ శిశువును నిందించడం, ద్వేషించడం, శిక్షించడం అన్యాయం, అక్రమంకూడా. ఆ వ్యక్తి జీవితానికొక మచ్చ కల్పించడం విజ్ఞతాలక్షణం కాదుఅని జాగ్రత్తగా ఆలోచించిన తర్వాత, శిశువు తప్పేమీ లేదని నిర్ణయించుకున్నాక, ఆ బిడ్డ పోషణకు అనువైన, ఆరోగ్యకరమైన వాతావరణాన్ని సమాజం కల్పించాలి ఆ తల్లిని ఎల్లకాలం హేళనచేస్తూ, తెగనాడుతూ, ఆమె నడతను సర్వదా ఖండిస్తూ వుంటే ఆమె ఆ పిల్లను ఆరోగ్యవంతంగా ఆహ్లాదకరంగా పెంచలేదు. బిడ్డ పెరుగుదలకు కళకళలాడేతల్లి కావాలి. బాబు భవిష్యత్తుకు సంతోషస్వాంతయైన మాత అత్యవసరం. కనుక మనకు మానవతాదృష్టి చాలా అవసరం; సామాజిక అవగాహనతో మనం పరిస్థితుల నవగాహన చేసుకోవాలి. కనుక ఏ దృష్టితో చూచినా మనం అవివాహితమాతను ఆదరించడం అవసరం.

ప్రస్తుతం అమల్లోవున్న ఏ శాసనమూ అవివాహిత స్త్రీని తల్లి కాకూడదని నిషేధించడం లేదు. ఇది శాసనవిరుద్ధంకాదు. పెళ్ళికాని తల్లికి ఏ శిక్ష విధించడం లేదు మన శాసనాలు. కాగా ఆ స్త్రీ ఫలాని పురుషుడు ఆ శిశువుకు తండ్రి అని ఆరోపణచేసి రుజువు చేయగిలిగితే అప్పుడు ఆ శిశువు అతని అక్రమ సంతానంగా పరిగణించ బడుతోంది. అతడు Putative Father అంటే గర్భధారణకు కారకుడైన తండ్రి అని అర్థం. అప్పుడా బిడ్డకు కొన్ని నిబంధనలతో వారసత్వపు హక్కుకూడా వస్తుంది. అయితే తల్లికి సంబంధించినంతవరకూ ఆ శిశువు ఆమెయొక్క సక్రమ సంతానమే. ఆమె ఆస్తికి ఆ శిశువు వారసుడే.

మన దేశంలో అమలులోవున్న హిందూ ముసల్మాన్, క్రైస్తవమతాలు కన్యత్వానికి అత్యధిక ప్రాముఖ్యత నిస్తున్నాయి. మగనిద్వారానే సంతానం కనమని ఆదేశించి కన్యాత్వాన్ని వరునికి సమర్పించ వలసిందని ఉద్ఘాటించాయి వివాహపూర్వం స్త్రీ పురుషుల లైంగిక సంపర్కాన్ని ఆమోదించి, ప్రోత్సహించే అమెరికాలాంటి సమాజాల్లోకూడా అవివాహితమాతను తక్కువచూపు చూస్తున్నారు.అంటే ఆఫ్రికాలోని కొన్ని తెగలలోనూ, ఇతరత్రా కొన్ని ఆటవిక సమాజాలలోతప్ప మరెచ్చటా పెళ్ళికాని తల్లుల్ని ఏ సమాజమూ ఆమోదించడంలేదు. సంప్రదాయ సిద్ధంగా అమల్లోవున్న వివాహ వ్యవస్థయొక్క పవిత్రతా భావంవల్ల ఈ దృక్పథం ప్రబలంగా వుంది. సెక్సునూ, వివాహాన్ని విడివిడిగా గమనించిన అమెరికన్ సమాజంలోకూడా

పెళ్ళికాని తల్లియొక్క ఆదరణలేదు. ఇది శోచనీయంకాదా! చట్టాలకంటే సామాజిక సాంప్రదాయాలకే విలువ ఇవ్వటమనేది ప్రపంచమంతటా జరుగుతోంది. దీనికి దేశకాల పాత్రల అవధులు లేవనేదానికి నిదర్శనాలు చాలా వున్నాయి.

ఈ మధ్య ఒక వింత సంఘటన జరిగింది. తే 22-11-74 న లండన్ లో మెక్కా సంస్థవారు అందాల పోటీలు నిర్వహించారు. ఇంగ్లండుకు చెందిన 22 సం॥ రాల హెలెన్ మార్గన్ ప్రపంచ సుందరిగా ఎన్నికయింది. ఆమె అవివాహిత మాత అని తెలిసి మెక్కా సంస్థవారు ఉలిక్కిపడ్డారు. దాంతో అగ్నిపర్వతం బ్రద్దలయింది. సంస్థ అధికారి పోటీనుండి విరమించమని ఆమెకు సలహా ఇచ్చాడు. "నేనేమీ తప్పుచేయలేదు. నే సంపాదించుకున్న ప్రపంచ సుందరి స్థానాన్ని నేను వొదులుకోబోను. అంతేకాదు నే నా బిడ్డను కనటంవల్లనే 12. 7 కిలోల బరువు తగ్గి అవయవ సౌష్టవాన్ని పొంది నే నీ పరీక్షలో నెగ్గా" నని గర్వంగా చెప్పింది. అయినా సనాతనుల, ఛాందసుల తాకిడికి తట్టుకోలేక, వారి వొత్తిడిపై, వారి దుష్ప్రచారంవల్ల హెలెన్ తన బిరుదాన్ని త్యజించింది. కుమారి హెలెన్ త్యాగానికి, ఆమె బిడ్డను ధైర్యంగా సాకుతున్నందుకు మనం ఆమెను శ్లాఘిస్తామా? నిందిస్తామా!

ఈనాడు అమెరికాలాంటి దేశాలలోకూడా విడాకులకు లోనైన స్త్రీలు పునర్వివాహ వాంఛను వదలుకొని తమ సంతానంయొక్క భవిష్యత్తుకోసం తమ సుఖ సంతోషాలను త్యాగంచేసి బిడ్డలకు విద్యాబుద్ధులు నేర్పుకుంటున్నారు. తామే తల్లీ దండ్రీ అయి పెంచుతున్నారు. ఈ వాస్తవం ఒక విషయాన్ని రుజువుచేస్తోంది. అదేమంటే తండ్రి నిర్వహించే బాధ్యతల్నికూడా తల్లి చేపట్టగలదని, పురుషాధిక్య సమాజంలో పెరుగుతున్న స్త్రీలకు మగదిక్కు లేకపోతే పిల్లలు చెడిపోతారనేభయం కలుగవచ్చు. కాని స్త్రీ పురుషులను సమానంగా పరిగణించే సమాజంలో అలాంటి భయానికి ఆస్కారంలేదు. తండ్రి ప్రేమకు నోచుకొని సంతానం మానసికారోగ్యం పొందలేరని కొంతమంది సైకాలజిస్టుల అభిప్రాయం. నిజానికి ఈ భావం వాస్తవం కాదు. ఇది కేవలం సంప్రదాయం బలంవల్ల ఆమోదింపబడుతున్నదే.

స్త్రీకి మాతృత్వంపై తీరనికాంక్ష వుంటుంది. ఇష్టమున్నా లేకున్నా కొన్ని సందర్భాలలో గర్భం రావచ్చు. సంఘానికి, కుటుంబానికి వెరచి భ్రూణహత్యలు చేస్తారు కొందరు. గర్భస్రావాలు చేసుకొంటారు మరికొందరు. సామాజిక నీతి దేశకాల పాత్రలనుబట్టి నిర్ణయింపబడుతుందని గ్రహించాలి. మన దేశంలో అవివాహిత మాతను చూపిస్తుంటే ఘనాలో ఆమెను వివాహమాడటానికి ఎంతో ఇష్టపడతారు.

వారి దృష్టిలో ఆమె గర్భధారణసత్తా రుజువయింది; కనుక ఆమె గొడ్రాలవి అవుతుందనేభయం లేదన్నమాట. ఒకనాడు మన దేశంలోకూడా కన్యల సంతానాన్ని అరమరికలు లేకుండా గుర్తించారు. 'గూఢజుడు' (అంటే పెళ్ళినాటికి తల్లి గర్భంలో వున్న సంతానమన్నమాట) అనే కుమారుని గుర్తించింది ఆనాటి సమాజం. అదీకాక కన్యకు పుట్టినవానిని 'కానీనుడు' అని పిలిచేవారు. కర్ణుడిని తన సోదరునిగా భావించి తర్పణం విడిచాడు ధర్మరాజు. మహాతపోనిష్ఠా గరిష్ఠుడైన పరాశరుడికీ కన్య అయిన మత్స్యగంధికి పుట్టిన వేదవ్యాసుని కురువంశోద్ధారకునిగా గుర్తించారు. ఇలా ఎన్నో ఉదాహరణలు చెప్పుకోవచ్చు.

ఇదంతా చదివి అవివాహితమాతలు ఎంత హెచ్చు సంఖ్యలో వుంటే అంత సమాజానికి మంచిదని వాదిస్తున్నట్లు అపోహపడవద్దు. స్త్రీ పురుషుల మధ్య పరస్పర విశ్వాసం, సన్నిహితత్వం గల దాంపత్యం ఉత్తమం. అంతమాత్రాన కన్య తల్లిగా వుండే పరిస్థితి నింద్యమని భావించడం అసమంజసం. "అంటే వివాహంద్వారా సంతానాన్ని కనాలా? లేక వివాహబంధం లేకుండా పొందవచ్చా?" అనేది ఆయా స్త్రీల ఇష్టాఇష్టాలపై ఆధారపడివుండాలి. కాని సామాజిక నీతి పేరుతో వారిపై ఒత్తిడి తేవడం న్యాయసమ్మతంకాదు. అవివాహితమాతల పిల్లలకు సాంఘికహోదా వుండాలి. ఆ పిల్లలకు తల్లి ఇంటిపేరు వుండేలా చూడాలి. ఇలా హేతుబద్ధమైన, శాస్త్రీయ అవగాహనతో కూడిన దృష్టిని ఈ సమస్యపై ప్రసరింపజేయాలి. ప్రతి స్త్రీ తానుగా నిర్ణయించుకోడానికి సంపూర్ణస్వేచ్ఛ కలిగివుండాలి. ఈ అంశాన్ని మన సమాజం ఎంత త్వరగా గుర్తిస్తే అంతగా అందరికీ మంచిది.

# ఆమె శరీరంపై హక్కు ఆమెదే!

హిందూ ధర్మశాస్త్రాలు (చట్టాలు) చాలా చిత్రాతి చిత్రంగా వుంటాయి. రెస్టిట్యూషన్ ఆఫ్ కంజుగల్ రైట్సు (వివాహవిధి పాటించమని కోరుట) అంటే "దాంపత్యజీవితం గడుపుటకు కలిసి కాపురం చేయవలసిందని భార్య భర్తను, భర్త భార్యను హిందూ వివాహపుశాసనం తొమ్మిదవ సెక్షన్ ప్రకారం కోరవచ్చును. దీనికై సివిల్ కోర్టులో పిటిషన్‌పెట్టి కోర్టు ఉత్తరవు పొందవచ్చు." ఇదొక శాసనమైతే, "పిల్లల్ని కనడానికి ముఖ్యంగా కుమారుని కనడానికి భార్య నిరాకరిస్తే భర్తకు విడాకులు పొందేహక్కు వుంది," అనేది పంజాబ్ హైకోర్టు తీర్పు. ఒక ఉద్యోగిని రెండు సం॥ రాల కాపురంలో రెండుసార్లు కడుపువస్తే 2 సార్లు గర్భస్రావం చేయించుకుంది. బిడ్డల్ని కనకుండా తనను చిత్రహింసచేస్తున్నట్లు నేరారోపణచేస్తూ భర్త విడాకులు కోరాడు. క్రిందికోర్టు విడాకులిచ్చింది. హైకోర్టు ధ్రువపరిచింది. జడ్జిమెంటులో "తన భార్యద్వారా సంతానం పొందాలని భర్తకు సహజమైన, న్యాయ సమ్మతమైన కోర్కె వుంటుంది. అది నిరాకరించబడితే అతడు నిరాశకు లోనవుతాడు. అది అతని మానసికారోగ్యానికి భంగకరం. పితృరుణం తీర్చుకోవటానికి, పిండాలు పెదలడానికి కుమారుడు కావాలని హిందువులు ఆకాంక్షిస్తారు. అలాంటి కుమారుని ప్రసాదించటానికి భార్య నిరాకరిస్తే ఆమె భర్తపైన హింసకు పూనుకున్నట్లే" అంటూ తీర్పు ఇచ్చింది పంజాబ్ హైకోర్టు. ఇలాంటి చట్టాలతో వింత వింత తీర్పులతో నల్లిలా నలిగిపోతుంది భారతనారి. అసలు బ్రిటీష్ శాసనం ప్రకారం కుమారుని కనకపోతే భార్యకు శిక్షలేదు. వంధ్యాత్వం (గొడ్రాలు) విడాకులకు కాని వేరుగా విడిపడి వుండటానికి కాని కారణంకాదు. అసలు కుమారుని కనగల శక్తి స్త్రీకి వున్నదో లేదో నిర్ధారణ చేయగలశక్తి ఏ వైద్యశాస్త్రానికీ లేదు. మరి కుమారుడిని కనమని శాసించడం ఎంతవరకు సబబో ఆలోచిస్తారా? అలాగే బలవంతంగా బంధించి కాపురం చేయమంటే అక్కడ నిజమైన ప్రేమా ఆప్యాయతలు ఉంటాయా?

ఇటీవల ఆంధ్రాలో ఇలాగే ఒకకేసు జరిగింది. తనతో సహజీవనం సాగించమని ఒకభర్త భార్యపై ఒక పిటీషన్ పెట్టాడు. ఆ పిటీషన్‌ను సవాల్‌చేస్తూ

బలవంతపు సంసారంవల్ల తనకు నష్టమని ఆమె వాదించింది. 14, 19, 21 రాజ్యాంగ అధికరణలలో వున్న సూత్రాలప్రకారం చట్టందృష్టిలో అందరూ సమానులేనని, వ్యక్తిస్వేచ్ఛకు భంగం వాటిల్లరాదని, శాసనంప్రకారం తప్ప ఇతరత్రా ఒక మనిషి యొక్క స్వేచ్ఛను, ప్రాణాన్ని హరించరాదని, మానవ విలువలకు భంగం వాటిల్ల రాదని కనుక హిందూ వివాహ శాసనం 9 వ సెక్షన్ చెల్లదని ఆమె హైకోర్టులో ఫిర్యాదు చేసుకొన్నది. బలవంతపు పొందు మానవత్వానికి, ఆత్మగౌరవానికి తీరని ద్రోహం అని సరిక్రొత్త నిర్వచనం చేస్తూ జడ్జి తీర్పుఇచ్చాడు. ఈ తీర్పు భార్యా భర్తల లైంగిక సంబంధాలలో నూతనాధ్యాయాన్ని సృష్టించింది.

ఇష్టమూ, సంతోషము, ఆత్మీయతా, ఆనందాలతో పరస్పర సమ్మతితో జరగాల్సిన స్త్రీ పురుషుల పొందును బలవంతంగా, శాసనబలంతో జరిపితే అది రాక్షసరతి అవుతుంది. ఆ కలయిక మానవధర్మ వ్యతిరేకం. ఆ మాటకొస్తే పశుపక్ష్యాదుల జీవిత ధర్మానికి కూడా వ్యతిరేకమే. స్త్రీ అంటే కేవలం ఒక విలాస వస్తువనే భావంతో తాను కోరినప్పుడల్లా ఆమె తనకు సెక్సుదాహం తీర్చాలనే అనాగరిక భావం గల పురుషులకు ఈ తీర్పు గొడ్డలిపెట్టులాంటిది. ఆత్మాభిమానం, వ్యక్తిత్వంగల మహిళలకు అమృతంలాంటిది. హిందూ వివాహ శాసనపు నిబంధనల ప్రకారం పెళ్ళి చేసుకున్న జంట దాంపత్య జీవితం గడపటానికి అంగీకరించినట్లు ఎంచుకోవాల్సి వుంటుంది. ముఖ్యంగా భర్త మాంగల్యమనే తాడు ఆమె కంఠానికి బిగించి ఆమె తను, ధన, మనః ప్రాణాలపై సర్వాధిపత్యాన్ని అనుభవించగల 'లైసెన్సు' ను పొందడాన్ని ఆ వివాహపుతంతు వివరిస్తోంది. ఇది మన ఆచారాలద్వారా అనుభవంలో జరుగుతున్న నగ్నసత్యం.

వివాహవిధి పాటించటమంటే దాంపత్యజీవితం గడపటానికి పరస్పరం అంగీకరించటం. అది పెళ్ళిద్వారా జరుగుతోంది. ఒకరితో పొందు మరియొకరికి ఇబ్బందిగావున్నా, ఇష్టం లేకపోయినా ఆయా మతస్థుల వివాహ శాసనాలలోని నిబంధనల మేరకు వారిలో ఒకరు విడాకులు కోరవచ్చు. కొన్ని పరిస్థితుల్లో భార్య భర్తనుండికాని, భర్త భార్యనుండికాని మనవర్తి పొందవచ్చును. కాని సహేతుకం కాని పరిస్థితుల్లో ఒకరు మరియొకరితో దాంపత్యజీవితం కొనసాగించుటకు ఇష్టపడనిచో వారు రెండోవారినుండి మనవర్తి పొందజాలరు.

దాంపత్య జీవితం గడుపుటకు కలసి కాపురం చేయవలసిందని భార్య భర్తను, భర్త భార్యను హిందూ వివాహపు శాసనపు తొమ్మిదవ సెక్షన్ ప్రకారం

కోరవచ్చును. దీనికై సివిల్‌కోర్టులో పిటిషన్ పెట్టి కోర్టు ఉత్తరువు పొందవచ్చు. ఉ॥ భార్యను తనతో కలిసి కాపురంచేసి దాంపత్యజీవితం గడపటానికి రమ్మని భర్త కోర్టులో పిటిషన్ పెట్టి ఉత్తరువు పొందితే ఆమె ఎట్టి పరిస్థితులలోను అతనివద్దకి మనవర్తి పొందజాలదు. ఈ అంశాన్ని గమనించి మరొక గ్రామంలో ఉద్యోగం చేస్తున్న భార్యను ఉద్యోగానికి రాజీనామాపెట్టి తను వున్నచోటవే కాపురం చేయమని పిటిషన్ పెట్టడం కోర్టు అలాంటిడిక్రీ ఆమెకివ్వటంమరో హైకోర్టు చేసింది. ఇలాంటివి సర్వసాధారణంగా జరుగుతున్న విషయాలే. స్త్రీ పురుషులిద్దరూ ఉద్యోగం చేసే ఈ రోజుల్లో భార్య ఉద్యోగాన్ని ఊడగొట్టించి ఆమెను ఇంటిపనికి కట్టుబడేలా చేయాలని భర్త ప్రయత్నించటం గమనించక తప్పదు. ప్రస్తుతమున్న ఈ 9వ సెక్షన్‌ప్రకారం భార్యకు వ్యతిరేకంగా తీర్పుపడితే ఆమెకు మనవర్తి హక్కు పోతుందని తెలుసుకున్నాం. అది అంత ప్రమాదకరంకాదు. కాని ఇలాంటి తీర్పు వచ్చిన రెండేళ్ళకు భార్యకాని, భర్తకాని కలిసి కాపురం చేయటానికి ఇష్టపడకపోతే దంపతులలో బాధపడేవ్యక్తి అంటే మొదట పిటిషన్ పెట్టిన వ్యక్తి విడాకులను కోరవచ్చు. ఈ అంశంకూడా అంత అభ్యంతరం కాదు. కాని భర్తతో కలిసి భర్త కాపురమున్నచోట దాంపత్య జీవితం గడపమని కోర్టు భార్యను ఆదేశిస్తే ఆమె ఏం చెయ్యాలి అనేదే నేటి ఆందోళనయొక్క ముఖ్యాంశం.

కోర్టు ఉత్తరువును మన్నించి ఆమె భర్తతో కాపురం చేయవచ్చు. లేదా కోర్టు వుత్తరువును పాటించక పోవచ్చును. మొదటి సందర్భంలో ఆమె పిటిషన్ విచారణ సమయంలో ఆమె భర్త కోరికను తిరస్కరించి కోర్టు ఉత్తరువు తర్వాత ఆమె భర్తతో కాపురం చేయుటకు సిద్ధపడితే సరేసరి. కాక ఆమె నిరాకరిస్తే భర్తకాని, భర్తతో కాపురం చేయడానికి ఇష్టపడనిచో రెండవవారుకాని విడాకుల కొరకు పిటిషన్ పెట్టుకోవచ్చు. కాని మొదటివారిని కాపురం చేయుమని బలవంతం పెట్టుటకు వీలులేదు. ఏ బ్రిటిష్ వారినుండి మనం న్యాయసూత్రాన్ని అరువు తెచ్చుకున్నామో వారే మార్చుకున్నారు. కాని మనం మాత్రం మార్చుకోలేదు. ఇది బుద్ధిమాంద్యము. ఈ అంశాన్నికూడా న్యాయమూర్తి తన తీర్పులో చెప్పారు. హిందూ ధర్మశాస్త్రంలో విడాకులకు కాని, కాపురం చేయనని నిరాకరించుటకు కాని తగిన ఏర్పాట్లు లేవు. మన్వాదులు అలాంటి సంఘటనలకు అవకాశం ఇవ్వలేదు. 1948 నుండి మాత్రమే శాసనంద్వారా కొన్ని రాష్ట్రాలలో మాత్రం విడాకులకు హక్కు లభించింది. అసలు వివాహం స్త్రీ పురుషుల సమ్మతిపై ఆధారపడి ఒప్పందం కావాలి. హిందూ మత శాస్త్రం ప్రకారం అది ఒక పవిత్ర విమ్యుక్త చర్య. అంటే అనేక పవిత్ర బంధం.

ఈ 'పవిత్రతా' భావం దాంపత్య జీవితంలోని అందాన్ని వమ్ముచేస్తుంది. వ్యక్తుల ఇష్టాఇష్టాలను తృణీకరిస్తోంది. వ్యక్తి స్వేచ్ఛను కాలరాస్తున్నది. కనుక పరస్పర సమ్మతిపై ఆధారపడే వివాహాలు అంగీకారయోగ్యాలు కావాలి. ఈ సెక్షన్‌పై వచ్చిన తీర్పు స్త్రీ యొక్క వ్యక్తిత్వ రక్షణకు దోహదం చేస్తుంది.

అలాగే పితృరుణం తీర్చుకోటానికి, పిండాలు వదలడానికి కుమారుడిని కనమని భర్త కోరటం, ముఖ్యంగా ఇష్టంలేని భార్యను నిర్బంధించటం దుష్కృత్యమే కాక నింద్యార్హమవుతుంది. నవమాసాలు మోసి, తన రక్త మాంసాలను పంచిపెట్టాల్సింది స్త్రీ. అలాంటి ఆమె తాను మాతృత్వాన్ని నిరాకరించవచ్చు. అది ఆమె జన్మహక్కు. అంతేకాదు. ఆ స్వేచ్ఛకు భంగం వాటిల్లరాదని మౌలిక హక్కులు వక్కాణిస్తున్నాయి. కనుక అలాంటి తీర్పులు ఇచ్చి స్త్రీలపై దౌర్జన్యం చేయుట అన్యాయం. ఆమె స్వేచ్ఛను కాలరాయటంకన్నా ఘోరం మరొకటిలేదు. ఆ మాటకొస్తే ఇష్టంలేని భర్తద్వారా స్త్రీ సంతానాన్ని వాంఛిస్తే అది న్యాయమేనని చాటి చెప్పలేని మన సమాజం ఈ తీర్పును హర్షించడం ద్వంద్వనీతి అవుతుంది.

అలాగే 'కంజుగల్ రైట్సు'ను పాటించమని స్త్రీని కోరటంకూడా ఆ మాటకొస్తే ఒకరు రెండవవారిని బలవంతం చేయటం అవివేకం, అజ్ఞానంకూడా. ఈ కేసుయొక్క మౌలికాంశం తరతరాలుగా స్వేచ్ఛ నోచుకొని స్త్రీ జాతికి వ్యక్తి స్వేచ్ఛను కాపాడుతుంది. స్త్రీ వ్యక్తిత్వ రక్షణకిది ఆశాకిరణం. భార్యను బలవంతంచేసి, తనతో కాపురం చెయ్యమనడానికి గాని పిల్లలను కనమని ఆజ్ఞాపించుటకుగాని భర్తకు కూడా హక్కులేదు. అంటే ఈ సూత్రాన్ని సమీక్షిస్తే ఒక ఇంట్లో భార్యాభర్తలు కాపురముంటున్నా భర్త భార్యపొందును బలవంతంగా అనుభవించడానికి వీలులేదు. అంటే ఆమె దేహంపై ఆమెకు గల హక్కును స్థిరీకరించడమన్నమాట. దీనిని స్త్రీ మానసంరక్షణ చర్యలకు దోహదం చేసేదిగా గుర్తించాలి. మానభంగాలను గురించి ఆందోళన చెందే ప్రతి స్త్రీ చట్టం సాయంతో తమపై భర్తలు జరిపే మానభంగాలను వ్యతిరేకించాలి.

ఈ విషయంలో సమ్యక్ దృక్పథం అవసరం. ఈ తీర్పుఫలితానిచ్చే అనుభవించగల సత్తా స్త్రీ జాతి అలవర్చుకోవాలి. అనుభవించలేని చట్టాలు' తీర్పులు వ్యర్థాలు. దానికి ఆత్మస్థైర్యం, మేధాశక్తి వుండాలి. ఏ పురుషుడైనా భర్తఅయినా సరే స్త్రీ యొక్క శరీరాన్ని ఆమె ఇష్టం లేకుండా వాడుకోడాన్ని స్త్రీజాతి సహించరాదు. ఈ అంశాన్ని స్త్రీలోకపు దృష్టికి తేవడం చైతన్యస్ఫూర్తిగల మహిళోద్యమ కార్యకర్తల కర్తవ్యమని భావించాలి.



# గర్భస్రావము స్త్రీపట్ల నేరమా?

అసలు మేము బిడ్డల్ని కనాలా? వొద్దా? కనాలంటే ఎప్పుడు కనాలి అనే హక్కు స్త్రీల ప్రాధమిక హక్కుల్లో మొదటిది కావాలి. "ఇంతవరకూ మేము పిల్లల్ని కనే హక్కు మా పెద్దల ఆజ్ఞలపైన, మతంపైనా, సామాజిక విధానాలపైనా ఆధారపడి వుంటోంది. ఆ హక్కు మాకిచ్చినపుడు కుటుంబనియంత్రణ (బర్త్ కంట్రోల్) చాలా విలువైనదిగా భావిస్తాం. కాని ఆ పద్ధతులు విఫలమైనప్పుడు మాకిష్టంలేని గర్భాన్ని తొలగించు కోటానికి గర్భస్రావం చేయించుకుంటాం. మాకు ఇష్టంలేని బిడ్డల్ని కని వారి జీవితాలను, మా భవిష్యత్తును నాశనం చేసుకొనేకన్నా గర్భస్రావం శ్రేయస్కరం. కనుక మాకు ఆ స్వేచ్ఛ పూర్తిగా కావాలి" అంటోంది ఆధునిక మహిళాలోకం. "అబార్షన్ అంటే పుట్టబోయే శిశువు ప్రాణాన్ని నశింపు చేయడమే. ఆ పిండాన్ని అలా నాశనం చేసేహక్కు ఎవరికీలేదు. అది జీవహింస, భ్రూణహత్యల క్రిందికొస్తుంది." అనేది మతివాదుల వివాదం. ఏ పరిస్థితుల్లోనూ గర్భస్రావం చేయించుకొనే హక్కు స్త్రీకి లేదని వాదించే పురుషులేకాక స్త్రీలుపైతం అధిక సంఖ్యలోనే వున్నారు. గర్భస్రావం పెద్ద చిక్కు సమస్య. దానిపై ప్రజలు విభిన్న వైఖరులను ప్రదర్శిస్తున్నారు. కొంతమంది దాన్ని పూర్తిగా ఆమోదిస్తే మరికొంతమంది అంత తీవ్రంగానూ వ్యతిరేకిస్తున్నారు. ఈ సమస్య చర్చకొచ్చి నప్పుడు ఆవేశ కావేశాలు పెరుగుతున్నాయి. ఉద్రేకాలు తారాస్థాయికి చేరుతున్నాయి. అసలే విధ్వంసకాండ జరుగుతున్న ఈ సమాజంలో ఇది మరో విధ్వంసచర్య అని ఒకవైపు ప్రేమ, అనురాగం, అందించలేని వాళ్ళకు, విద్యా వైద్య సౌకర్యాలు సమకూర్చలేని వాళ్ళకు బిడ్డల్ని నిర్వీర్యులను చేసేహక్కు ఎవరిచ్చారని మరోవైపు పోరాడుతున్నారు. కనుక దీన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తే ఈ సమస్యను వివిధ దృక్కోణాలనుండి పరిశీలించాల్సి వుంటుందని తేలింది, జనాభా సమస్య పరిష్కార మార్గంగా, స్త్రీ యొక్క వ్యక్తిత్వ స్థిరీకరణ విధానంగా, స్త్రీల ఆరోగ్యంపైన ప్రభావం చూపేదిగా, నైతిక సమస్యగా, మతధర్మ శాసనాల ఉల్లంఘనంగా, దేశప్రయోజ నాలకు సంబంధించినదిగా, శాసనరూపం దాల్చిన మానవ ప్రయత్నంగా దీనిని బహుముఖాల సందర్శించటం అవసరమయింది.

ఈ నాటి ప్రపంచ జనాభా 600 కోట్లకు పెరిగి అనేక అవరోధాలకు దారి తీస్తోంది. ముఖ్యంగా తూర్పు ఆసియా, ఆగ్నేయా అసియా రాజ్యాలలో ఇది తీవ్రతరమవుతోంది. మన దేశ జనాభా 68 కోట్ల 30 లక్షలు దాటితే, చైనావారు నూరుకోట్ల పైగా వున్నారు. ప్రపంచ విస్తీర్ణంలో 2% మాత్రమే వున్న మనకు 14% ప్రజలను భరించాల్సిన భారం నెత్తిన పడ్డది. 6 వ వంతు భూభాగం కలిగిన రష్యా 30 వ వంతు జనాభాను కలిగివుండి తమకు జనాభా సమస్య లేదనడం హాస్యాస్పదం కాదా! పైగా జాతీయత పేరుతో ఇతరులను రానీయకుండా ప్రగల్భాలు పల్లెవేయటం తేలిక. జనాభా పెరుగుదల నరికట్టటానికి పరిమిత కుటుంబాలను ప్రోత్సహిస్తున్నాం; జన్మనిగ్రహసాధనాలను, మందులను, వంధ్యాకరణ శస్త్రచికిత్సలను ఉధృతం చేస్తున్నాం. ఒక దశాబ్దంనుండి గర్భస్రావ విధానాన్ని సాధనంగా వినియోగిస్తున్నాం. మన దేశం గుర్తించిన 5 ఏళ్ళకు కుటుంబనియంత్రణ ప్రాముఖ్యతను గుర్తించిన చైనా అన్ని పద్ధతులనూ ఆచరణలో పెడుతూ ముఖ్యంగా గర్భస్రావ విధానాన్ని హెచ్చుస్థాయిలో జరిపిస్తోంది. షుమారు 30 ఏళ్ళనుండి జపాన్‌వారు గర్భస్రావాన్ని అమలు పరుస్తున్నారు. ప్రతి ముగ్గురి స్త్రీలలో ఇద్దరు స్త్రీలు ఇచ్ఛా పూర్వకంగా గర్భస్రావం ఎప్పుడో అప్పుడు చేయించుకున్నవారే. చైనాలో గర్భస్రావం చేయించుకోతలుచుకున్న స్త్రీకి ప్రభుత్వం వైద్య సౌకర్యాలు నిర్నిబంధంగా కలిగిస్తోంది. మొత్తంమీద శస్త్రచికిత్సల తరువాత గర్భస్రావం అగ్రస్థానంలో వుంటోంది అనేది యదార్థం.

మనది మత పరమైన దేశం. మానవజాతి కొనసాగటానికి స్త్రీ విధిగా సంతానాన్ని కనాలని, ఆ శక్తిని ఆమెకు ప్రకృతి ప్రసాదించిన వరమని అది దేవుని ఆజ్ఞ అని చెప్పడం వింటున్నాం. అదిచాలక సంతానప్రాప్తి నిమిత్తం స్త్రీ ఎల్లప్పుడూ పురుషుని అధీనంలో వుండాల్సిన జీవి అని, అందువల్ల ఆమె భర్త అనుమతి లేకుండా గర్భస్రావానికి పూనుకోవడం అనుచితమనే అభ్యంతరాలు బోలెడన్ని వున్నాయి. అసలు వంశోద్ధరణ, కొరకే స్త్రీకి వివాహవిధి జరపాలని, మొదటిబిడ్డ 'ధర్మజు' డని, తరువాత వాడు 'కామజు' డని, తదుపరి జరిగే లైంగికకార్యం అవినీతి కరమని తద్వారా కలిగే గర్భం ఆమెకు శిక్షగా పరిణమిస్తుందని ధర్మశాస్త్రాలు నిర్దేశిస్తున్నాయి. మళ్ళీ 'సంతానప్రాప్తిరస్తు' అని దీవించే ద్వంద్వనీతికూడా కొన్ని శాస్త్రాల్లో వుంది. ఏది ఏమయినా గర్భం తాల్చేది స్త్రీ; నవమాసాలు మోస్తూ తన రక్తమాంసాలద్వారా పోషించేది ఆమే. అంటే గర్భస్థపిండం ఆమె శరీరంలో భాగం. అది ఆమె వస్తువు. దాన్ని ఆమె తన ఇచ్ఛ వచ్చిన రీతి వాడుకోవచ్చు. సంతానంమీద మోజు వుంటే, పిల్లల్ని పెంచగల ఆరోగ్యం ఆమెకు వుంటే, ఉత్సాహం ఉరకలు

వేస్తూవుంటే ఆమె బిడ్డను కనవచ్చు. కాని ఆ గర్భధారణే ఆమెకు అవమాన కారణమయినప్పుడు శారీరకంగా, మానసికంగా భారమయినప్పుడు, ఆమె ఇతరత్రా సంఘసేవ, శాస్త్ర పరిశోధన, సాహిత్యంపై ఆసక్తి, లలితకళల సాధనలలాంటి వాటిపై ప్రాముఖ్యత ఇస్తున్న తరుణంలో గర్భస్రావం చేయించుకొనే హక్కు ఆమెకు వుంది. అంతేకాక మాతృత్వ వాంఛలేని స్త్రీలుంచటం నేరమా! ఆమె ఒక మనిషి కనుక మానవులకందరికీ వుండే మౌలిక హక్కులు ఆమెకూ వున్నాయి. కనుక ఆమె దేహంమీద సర్వంసహాధికారం ఆమెదే. గర్భస్రావం చేసుకోవడం, మానడం ఈ రెండూ ఆమె ఇష్టాఇష్టాలపై ఆధారపడతాయి. ఇది ఆమె వ్యక్తి స్వేచ్ఛకు సంబంధించిన విషయం. ఆమె వ్యక్తిత్వ స్థిరీకరణకు ఇది గీటురాయి.

భారతదేశంలో 48% ప్రజానీకం ఇప్పటికే దారిద్ర్యరేఖకు దిగువన వున్నారు. బహు సంతానవతియై ఈసురోమంటూ కృంగిపోయే మహిళను మరి కొంతమంది పిల్లల్ని కనమని ఆదేశించడం అమానుషం. ఆమెకు శారీరక మానసిక ఆరోగ్యం ఎలా వుంటుంది? మానసికోల్లాసం కోసమైనా ఆమె గర్భస్రావానికి పూనుకోవడం అనుచితం కాకపోగా వివేకవంతమైన చర్య అని మనం భావించాలి. 'అన్నింటికన్నా ముఖ్యమైనవి ఆమె ఆరోగ్యం, ఆమె ప్రశాంత జీవితం' అనేది నగ్నసత్యం.

గర్భస్రావం పేరెత్తగానే చాలామంది బెంబేలు పడిపోతారు; గజగజ వణికిపోతారు. రౌద్రాకారం తాలుస్తూ కళ్ళవెంట నిప్పులు కురిపిస్తారు. హింసకుసైతం సన్నద్ధమవుతారు, ఇదంతా నీతిపేరుతో జరిగే చర్య. "పిండానికి ప్రాణమున్నది దాన్ని త్రుంచటానికి తల్లికైనా హక్కులేదు" అని ఎలుగెత్తి అరుస్తారు. "తల్లే పిల్లను చంపితే నీతికి స్థానమెక్కడుంది." అని నోబుల్ బహుమతి గ్రహీత మదర్ థెరిసా ప్రపంచ పర్యటనలో ప్రచారం చేసింది. స్త్రీ ప్రసవించాక శిశువుకు వేరే వ్యక్తిత్వం వుంటుంది. తల్లిపేరు, పిల్లపేరు. కనుక అప్పుడు పిల్లను చంపటానికి తల్లికికూడా హక్కులేదు. గర్భస్థ పిండపు పరిస్థితి వేరు. దానికి వేరే అస్తిత్వంలేదు; మనుగడ అసలేలేదు. ఈ జీవశాస్త్ర సంబంధమైన వాస్తవికజ్ఞానం లేనందువల్ల కొంతమంది పైవిధంగా ప్రచారం చేస్తూవుంటే మరికొందరు తమ తమ మత వాసనలను మాటున దాచి పైకి మానవనీతి ప్రవచనాలను వల్లిస్తున్నారు. అసలు ఆ మాటకొస్తే, ఏదిమంచి? ఏదిచెడు? ఎవరు నిర్ణయించాలి? చుట్టూవున్న సామాజిక పరిస్థితులను ఆకళింపు చేసుకొని, తన ప్రత్యేక అవసరాలను గుర్తించుకొని, తన అంతర్బుద్ధి ప్రేరితంగా వివేకవంతంగా సంచరించడమే నీతి అవుతుంది. అలాకాక ఆత్మనాశనానికి దారితీసేది, పరహింసకు ప్రోది చేసేది ఏనాడూ నీతి అని అనిపించుకోదు.

ఈ యదార్థాన్ని గుర్తించినవారికి గర్భస్రావం నీతివంతమా లేక అవినీతికరమా అనే ఆలోచన ఒక సమస్యగా పరిణమించదు.

మతమంటే ఉత్పత్తి అర్థంతో చూచుకుంటే "ఒక విశిష్టమైన అభిప్రాయం" అంటారు. కాని వాడుకలో దేవునికి, మానవునికీ వున్న సంబంధాన్ని నిర్దేశించేదాన్ని మతమని పిలుస్తున్నాం. విభిన్న దేశాలలో, విభిన్న శీతోష్ణస్థితులలో అనేక మతాలు వైవిధ్యంతో వెలిశాయి. కాని సమాజాన్ని నియంత్రణ చేస్తూ బహుళవ్యాప్తి, ప్రచారము వున్న మతాలన్నీ మానవుని దేవునికి దాసోహం చేస్తాయి; బానిసను చేస్తాయి. అంతటితో ఆగక స్త్రీని పురుషునికి దాసిగా మార్చాయి. కనుకనే హిందూ, ముస్లిం, క్రైస్తవమతాలు గర్భస్రావాన్ని గర్హిస్తున్నాయి. అందులో ముఖ్యంగా రోమన్ కేథలిక్కులైన క్రైస్తవులు, సనాతన హిందువులు, సంప్రదాయ ముస్లింలు గర్భస్రావం పేరెత్తగానే మండిపడతారు. వారి దృష్టిలో అది మహాపాపం. స్త్రీని క్షేత్రంగా భావించి పురుషుని బీజరూపుడుగా చిత్రించి పురుషప్రాధాన్యతగల సమాజాన్ని ఈ మతాలు ఇన్నాళ్ళూ పోషించాయి. పురుషాధికార విజృంభణకు వ్యతిరేకం కనుక, మతం గర్భస్రావాన్ని నిందిస్తుంది. ఎంత సంతానం కావాలో, ఎలాంటి బిడ్డలు కలగాలో - కుమారుడు కావాలి - నిర్ణయించాల్సింది, మతందృష్టిలో, పురుషుడు. అసలువిషయం ఎంతమంది సంతానం వుంటే పురుషుడు అంత ప్రయోజకుడన్నమాట! కనుక భర్త అనుమతి లేకుండా గర్భస్రావాన్ని స్త్రీ చేపడితే అంతకన్నా ఘోరపాపం మరొకటి వుండదు మతదృష్టిలో. ఈ భావాలు వింటేనే కొంతమంది మతస్థులు ఆగ్రహిస్తారు. మరి నిజం ఎప్పుడూ చేదుగా వుండక తప్పదుకదా! మతశాస్త్రాల పేర అమలు పరిచే ఆచారాల వెనుక దాగివున్నా పురుషాధిపత్య సమాజపు పోకడలను వెలికితీస్తే బాధపడడం న్యాయంకాదు. ఇలాంటి అన్యాయపువైఖరి దేవునిపేర ప్రదర్శించడం శోచనీయమే కాక, దుఃఖభాజన మవుతుందికూడా.

దేశప్రయోజనాలను సాధించటానికి, దేశప్రగతిని కొనసాగించడానికి శక్తివంతమైన, ప్రజానీకం కావాలి. వివేకవంతులు, జ్ఞాన సంపన్నులూ, సాహసోపేతులు, ధైర్యసంపన్నులూ, ఆరోగ్యవంతులూ అయిన ప్రజలున్నప్పుడే దేశం ప్రవర్ధమాన మవుతుంది. అలాంటి ప్రజానీకాన్ని సంతరించుకోవాలంటే గర్భస్రావం విషయమై దేశం ఒక నిర్దుష్టమైన వైఖరిని ఆమోదించి అవలంబించాలి. గర్భస్రావం చేసుకోవటానికి స్త్రీకిగల నిర్నిబంధమైన హక్కును ప్రభుత్వం గుర్తించాలి; దానికనుగుణంగా శాసనాలను మార్చాలి; హాస్పటల్సులో అందుకనువైన వసతులను,

సౌకర్యాలను కలుగజేయాలి. నాటువైద్యుల వాతబడినవారిని, నాటుమంత్రసానుల నాశ్రయించి ప్రాణాలు పోగొట్టుకున్నవారిని రక్షించడం ప్రభుత్వవిధి; కర్తవ్యం కూడా, కనుక గర్భస్రావ చట్టాలను పరిశీలించుట, సవరించుట తక్షణ కర్తవ్యం.

ఒకనాడు గర్భస్రావం నేరం. ఇటీవల ఆరోగ్య సదుపాయాలు పెరిగినందువల్ల దొంగతనంగా గర్భస్రావం చేయించుకున్నవారు ప్రాణాపాయస్థితిలో డాక్టర్లవద్దకు రావడం సంభవిస్తోంది. ఆ తల్లుల ఆరోగ్యం దెబ్బతింటోంది. అదికాక అలాంటి స్త్రీలలో హెచ్చుమంది వివాహితులే వుంటున్నారు. ఈ పరిస్థితులను గమనించి కరుణాదృష్టితో, ఆరోగ్యకరమైన సంసారాభివృద్ధి జరగాలనే సంకల్పంతో 1969 లో, కేంద్ర ప్రభుత్వం చే గుర్తింపబడిన వైద్యులు కొన్ని పరిస్థితుల్లో గర్భవిచ్ఛిత్తి చేయుటకు అవకాశ మిచ్చే శాసనపు బిల్లును - చిత్తు గర్భస్రావ చట్టాన్ని (మెడికల్ టెర్మినేషన్ ఆఫ్ ప్రెగ్నెన్సీ యాక్టు) - ప్రకటించారు. ఈ కేంద్ర శాసనం 1972 ఏప్రియల్ నుండి అమల్లోకొచ్చింది. ఆరురకాల పరిస్థితుల్లో ఏదైనా ఒకటి వున్నప్పుడు మాత్రమే గర్భస్రావం చేయవచ్చు. అవి - గర్భిణీ స్త్రీ జీవితానికి ప్రమాదం వున్నప్పుడు; ఆమె శారీరక ఆరోగ్యానికి గాని, మానసిక ఆరోగ్యానికి కాని భంగం కలుగుతున్నప్పుడు, చెరచబడిన స్త్రీకి గర్భంవస్తే, పిల్లల సంఖ్యను తగ్గించుకోవాలని జన్మ నిగ్రహసాధనాలను దంపతులు వాడుతున్నా అవి నిరుపయోగమై ఆమెకు గర్భంవస్తే, ఈ రెండు సందర్భాలలో ఆమెకు కలిగే మనోవ్యధ ఆమె మానసిక ఆరోగ్యానికి భంగకరంగా వివరించబడింది. అంటే పై రెండు సందర్భాలలోనూ ఆమె గర్భస్రావం చేయించుకోవచ్చు. గర్భస్రావం ఆస్పత్రిలోగాని, ప్రభుత్వంవారు నిర్ణయించిన ప్రదేశాలలోగాని జరగాలి. మైనరు విషయంలో మతిస్థిమితంలేని స్త్రీ విషయంలో సంరక్షకుని సమ్మతి కావాలి. ఇతరత్రా ఆమె సమ్మతి విధిగా కావాలి. 12 వారాలలోపు అయితే నిర్ణయం ఒక డాక్టరుదే. అదే 20 వారాలలోపు అయితే ఇద్దరు వైద్యులు నిర్ణయించాలి. 20 వారాల తరువాత గర్భస్రావం ఇప్పటికీ నేరమే. ఇది అనుచితం. కనుక మార్చాలి. ఎన్ని నెలలైనా, ఎప్పుడైనా తను గర్భస్రావం చేయించుకొనే హక్కు స్త్రీకి విధిగా ఇస్తూ దాన్ని చట్టసమ్మతం చేయాలి. గర్భవిచ్ఛిత్తి ఉచితంగా చేయించాలి. ఆరోగ్య విధానాల్లో జరిపించాలి. స్వచ్ఛందంగా జరగాలి. ఇది తప్పు అని వాదించే వారితో అంత పేచీ లేదు. కాని చేసుకొనే వారి హక్కును కాలరాయడం క్షంతవ్యం కాదు. తమ సిద్ధాంతాలను ఇతరులమీద రుద్దటం అన్నింటికన్నా ఘోరం.

అమెరికా సుప్రీంకోర్టు 1973 లో ప్రతి స్త్రీకి గర్భవిచ్ఛిత్తికి హక్కు వున్నదని, అది ఆమె వ్యక్తి స్వేచ్ఛలో భాగమని తీర్పు ఇచ్చింది. ఈ తీర్పును రాజ్యాంగసవరణద్వారా వమ్ము చేయాలని గట్టిప్రయత్నాలు జరుగుతున్నాయి. పురుషవైద్యులు విముఖులుగా వుంటున్నారు. అందువల్ల మహిళాకార్యకర్తలు ప్రత్యేక వైద్యశాలలు నెలకొల్పి గర్భస్రావాలు చేయిస్తున్నారు. మన స్త్రీలుసైతం అడ్డంకుల నధిగమించి తోటిస్త్రీల శ్రేయస్సు తమ ప్రధమ కర్తవ్యంగా భావించక తప్పదు.

స్త్రీలహక్కుల్లో అతి సామాన్యమైనహక్కు తమ శరీరంపై తమకు హక్కు వుండాలని 1921 లో సాంగర్ కోరింది. ఎన్నో తర్జన భర్జనల తర్వాత 1973 లో అంటే 52 సం॥ తర్వాత ఆ హక్కు వారికి వచ్చింది. ఖూనీలు జరుగుతున్నాయి. నేరస్తులను ఉరితీస్తున్నారు. సైనికులను హతమారుస్తున్నారు. తిండిపెట్టలేక చంపవచ్చు కాని ఇష్టంలేని గర్భవిచ్ఛేదం నేరమని, సాంఘిక ద్రోహమని, సంప్రదాయ విరుద్ధమని స్త్రీలను శిక్షించుట అసహజమే కాక అహేతుకమని అర్ధంచేసుకోవాలి.

# 'మెనోపాజ్'

మెనోపాజ్ (ము ట్లు డు గు ట) అంటే ఏమిటి? అది ఎందుకొస్తుంది? ఎప్పుడొస్తుంది? దానివల్ల లాభనష్టాలేమిటి? ఆ సమయంలో స్త్రీల పరిస్థితి ఎలా వుంటుంది? అనే విషయాలమీద పెద్దగా తేడాలులేవు. కాని స్త్రీల శారీరక, మానసిక పరిస్థితుల మార్పును గురించిన అభిప్రాయాలలో వైవిధ్యమున్నది. 'సైన్‌టిఫిక్' గా డాక్టర్లు రుజువుచేసి చెప్పేదానికి, వ్యక్తికీ వ్యక్తికీ అనుభవంలో వున్నదానికి కొన్ని తేడాలున్నాయనడంలో సందేహంలేదు. ముట్లుడుగుతున్న సమయంలో ప్రతి స్త్రీకి కొన్ని రుగ్మతలు సంభవిస్తాయి. కొన్ని శారీరక సంబంధమైనవైతే మరికొన్ని మానసికమైనవిగా వుంటాయి. ఈ రెండురకాలైన సమస్యలు, చికాకులు కూడా రకరకాలైన రూపాలలో వుంటాయి. మనిషికీ, మనిషికీ రూప, గుణ, లక్షణాలలో తేడాలున్నట్లే ఈ బాధలు కూడా అందరికీ అనుభవంలో ఒకలావుండవు. అసలు మాకు ఏ విధమైన అసౌకర్యమూ కలుగలేదని చెప్పేవారూ లేకపోలేదు. కనుక కొంతమందిని పరిశీలించి వివిధ దృక్కోణాలనుండి దీని విషయమైన సమాచారం సేకరించి అమాయకులు లేక విషయజ్ఞాన శూన్యులైన స్త్రీలకు ఈ విధమైన విజ్ఞానాన్ని అందివ్వటం చాలా అవసరం. కనుక 'మెనోపాజ్' ను గురించి చర్చించటం అవసరమయింది.

బాల్య, యవ్వన, కౌమార, వార్ధక్యాలు మానవ జీవితంలో ముఖ్యదశలు. వ్యక్తి జన్మించినదాది పెరుగుతున్న కాలంలో అనేక మార్పులకు లోనౌతాడు. ఈ పరిణామ దశలో శారీరక, మానసిక మార్పులలో వ్యక్తికీ, వ్యక్తికీ వైవిధ్యం వుంటుంది. ఆ మార్పులు అనివార్యాలు. అంతేకాదు అవి దేహధర్మాలుకూడా. దేశకాల పరిస్థితులు వాటిని అధిగమించలేవు. ఏ దేశమైనా, ఏ కాలమైనా, ఏ జాతి అయినా ఈ పరిణామం ప్రకృతి ధర్మం. అంతేకాదు స్త్రీ పురుషులిద్దరికీ ఈ నాలుగు దశలూ జీవిత పోరాటంలో ప్రకృతి ధర్మాలు శారీరక విధులుకూడా. ఇవి ఇద్దరికీ ఒకే విధంగా వున్నా శారీరక విషయాలలో తేడాలున్నాయి. "పిండోత్పత్తికి పురుష డొక్కడే సూత్రధారి కాదు, అది 'నాసుడి' గా మాత్రమే గ్రహిస్తే సగం సమస్యలు సమసిపోతాయి. అసలు సంతానోత్పత్తిలో ప్రముఖపాత్ర వహించేది స్త్రీ అనక తప్పదు.

స్త్రీకి 90% బరువు బాధ్యతలుంటే పురుషుడికి 10% మాత్రమే వుంటాయి గర్భధారణ, ప్రసవమూ, బిడ్డల పెంపకం లాంటివన్నీ స్త్రీలే భరిస్తున్నారుకదా!

స్త్రీ జీవితంలో మాత్రమే ముడిపడిన ముఖ్యదశలు మూడు. అందులో 'ప్యూబర్టీ' అంటే సమర్త లేక రజస్వల అగుట మొదటిది. సంతానోత్పత్తి రెండవది కాగా, ముట్లుడుగుట మూడోదశగా విభజించవచ్చు. ఈ దశలలో స్త్రీకి అనేక కష్టాలు, నష్టాలు, సుఖదుఃఖాలు ఇమిడి వుంటాయి. ఈ మూడు దశలు లేని మరోస్థితి వుంది. దానిని 'మాచకమ్మ' అని పిలుస్తారు. అంటే ఆమెకు ముట్లూ వుండవు; పిల్లలూ కలుగరు; బహిష్టు ఆగిపోవుట అనే స్థితి వుండదు. అయితే ఇక్కడొక తేడాను మనం గ్రహించాలి. మాచకమ్మలకు కొజ్జాలకు మళ్ళీ తేడా వుంటుంది. మాచకమ్మ దాంపత్య జీవితానికి మాత్రం పనికివస్తుంది. కానీ కొజ్జాలనే వారికి పురుషత్వమూ వుండదు; స్త్రీ లక్షణాలూ వుండవు. కేవలం మనుష్యులుగా పుట్టి పెరుగుతారు. ఈ రెండురకాలు కాని మరోరకం స్త్రీలు వుంటారు వారిని 'గొడ్రాళ్ళు' అంటారు. అంటే ఆ స్త్రీలకు ముట్లూ, గర్భసంచీ, అండాశయమూ అన్నీ వుంటాయి. కాని సంతానయోగ్యత వుండదు. పూర్వపురోజుల్లో వారి భర్తలు మళ్ళీ పెళ్ళాడేవారు. కాని సైన్సు అభివృద్ధివల్ల గొడ్రాళ్ళను బిడ్డతల్లుగా మార్చే శస్త్ర చికిత్సలు ఈనాడు చేస్తున్నారు. ఆ స్త్రీలకు ఏదో ఒక లోపం వుండవచ్చు. గర్భాశయం తిరగబడటం, లేక ప్రక్కకు వుండటం, లేదా మార్గం సరిగా లేకపోవటం, చాలా ఇరుకుగా చిన్నదైయుండటం లాంటివే అవి. నేడు వాటిలో కొన్నింటిని సరిచేసే పరిస్థితులు వచ్చాయి. అయినా కొన్నిలోపాలు చికిత్సద్వారా కూడా సరికావటంలేదు. అండాశయం (ఓవరీ) లో లోపం, లేక అండం (ఓవమ్) లో జీవం లేకపోవటంలాంటివి సరిచేయుట దుస్సాధ్యమవుతున్నాయి. కొన్ని కేసుల్లో పురుషుని జీవకణాలు లోపభూయిష్ఠంగా వుంటాయి. భర్త వీర్యంలో పురుషబీజ కణాలు చాలా తక్కువగా వుండటంవల్ల భార్య విడుదల చేసే అండాన్ని చేరలేవు. అందువలన గర్భంరాదు. తెలియనివారు స్త్రీని మాత్రమే గొడ్రాలుగా దూషిస్తూ వుంటారు. ఇవన్నీ ఆమె సంతానోత్పత్తికి సంబంధించిన అంశాలు. బహిష్టు నిలిచిపోవుటకు సంతానోత్పత్తికి సంబంధం వుందా? వుంటే దానికి మూల కారణాలేమిటి? అనేది మరో అంశం అయింది.

ప్రతి వ్యక్తిలో స్త్రీత్వానికి, పురుషత్వానికి సంబంధించిన శారీరక సాధనాలు వుంటాయి. 'మెనోపాజ్' సమయంలో 'ఓవరీ' తన పనిచేయడం విరమించుకుంటుంది. అందువల్ల స్త్రీత్వ శారీరక నిర్మాణానికి సంబంధించిన ప్రక్రియ జరగదు. కనుక

ఇది ఒక రకంగా ఒక శక్తి లోపించుట రుగ్మతగా భావించవచ్చు. కనుక ఈ కాలాన్ని శారీరక మార్పుల కాలమే కాకుండా జీవితంలో ఒక మార్పుతో కూడిన శకంగా ఎంచుకోవాలి. అంటే స్త్రీత్వ లక్షణం పోయి పురుషలక్షణం మిగిలిపోయిన దశగా ఎంచుకోవచ్చు. కాని మన అజ్ఞానం మన్ని సైన్సుగురించి తెలిసికోనివ్వదుకదా!

అసలు స్త్రీలు ఈ విషయమై పెద్దగా చర్చించరు. బాధలున్నా బయటపెట్టరు. పూర్తిగా మతపరమైన ఈ దేశంలో మతానికి మానవ మనుగడకు సంబంధం కల్పిస్తారు. స్త్రీలకు సైతం కోరికలుంటాయని ఆలోచించరు. వారి చిక్కులను, సమస్యలను గురించి పట్టించుకోరు. అందువల్లే ఎంత రక్తస్రావం జరుగుతున్నా, ఎంత నీరసించిపోతున్నా సిగ్గుతోనూ, భయంతోను, ఆచార సాంప్రదాయాలకు తల వొగ్గి దూర దూరంగా పోతారు. కాకపోతే ఏ దేవతో, దయ్యమో పట్టిందని ప్రదక్షిణలు, మొక్కుబడులు, జపతపాలు చేస్తారుకాని వైద్యసహాయం కోరరు.

మెనోపాజ్ (ముట్లుడగటం) అంటే శారీరక మార్పుకు సంబంధించిన ఒక ప్రక్రియ. అది శారీరక లక్షణమేకాని వ్యాధికానేకాదు. మానవ దేహంలో హార్మోన్ల పాత్ర చాలా అద్వితీయమైంది. అందులోకొన్ని మానసికశక్తులపైన, మరికొన్ని శారీరక అవయువాల విధినిర్వహణలోను ప్రముఖపాత్ర వహిస్తాయి. ఇవి మామూలుగా సమతుల్యస్థితిలో పని చేస్తూ వుంటాయి. అవి నలభై సం॥ రాలు నిండిన వ్యక్తుల్లో కొన్ని మార్పులు తెచ్చే లక్షణం కలిగివుంటాయి. దాన్నే కౌమారదశ అంటారు. అప్పుడు అన్ని అవయవాల శక్తి సామర్థ్యాలు ( వేర్ & టేర్) తగ్గుదల ప్రారంభ మవుతుంది. వ్యాధులపై ప్రతిఘటనాశక్తి (రెసిస్టెన్సుపవర్) తగ్గిపోతుంది. స్త్రీ దేహంలో హార్మోన్ల సమతుల్యస్థితి మారుతున్న దశలో కలిగే పరిణామ ఫలితమే 'మెనోపాజ్' కు మొదటికారణం. శాస్త్రీయ అవగాహనా లోపం స్త్రీలలో మెండుగా వుండటంవల్ల శరీరశాస్త్రం, భౌతిక శాస్త్రాలను గురించిన అవగాహన వారికి వుండదు. అదికాక మెనోపాజ్ ను గురించి వ్యతిరేక భావంతో ప్రచారం జరిగినందువల్ల స్త్రీలలో భయాందోళనలు కలుగుతున్నాయి. శారీరక రుగ్మతలకంటే మానసిక ఆందోళన ప్రమాదకరం. కనుక 'మెనోపాజ్' దశలోనున్న స్త్రీలకు వారి శారీరక, మానసిక పరిస్థితుల అవగాహన అవసరం అనక తప్పదు.

సాధారణంగా 40 – 52 సం॥ లోపల ముట్లు ఉడిగే కాలంగా చెప్పుకోవచ్చు. కాని 45 – 55 లోపల అని కొందరంటే 42 – 58 లోపల జరగవచ్చని కొందరు వాదిస్తున్నారు. ఇది దేశాల శీతోష్ణస్థితినిబట్టి, శారీరక పరిస్థితుల్నిబట్టి వుంటుందికాని

ఖచ్చితమైన వయస్సు, తేదీలు దానికుండవు. 10, 11 సంవత్సరాలప్పుడు రజస్వల అయితే త్వరలో (38 - 40) ముట్లు పోతాయనుకోవడం భ్రమ. దానికీ దీనికీ సంబంధంలేదు. గర్భసంచీ తీయించుకొన్నా (ఆపరేషన్‌ద్వారా) 'మెనోపాజ్' రాదు. కొందరికి 'ఒవేరియన్‌సిస్టు' వస్తుంది. అప్పుడా 'ఒవరీ' ని డాక్టరు తీసివేస్తుంది. అప్పుడుకూడా 'మెనోపాజ్' రాదు. పూర్తిగా రెండు ఓవరీస్ తీసేస్తేనే 'మెనోపాజ్' వస్తుంది.

'ప్యూబర్టీ' కాలంనుండి ప్రతిస్త్రీకి నెలకొక (సరిగా 28 రోజులకు) 'ఓవమ్' ను తయారు చేస్తుంది 'ఓవరీ'. కాని ముట్లుడిగే సమయానికి ముందుగానే దాని ప్రభావం తగ్గుతూ వుంటుంది. అంటే ప్రతినెలా చాలా 'పవర్‌ఫుల్' గా దూకుతూ 'ఫెలోఫియన్ ట్యూబులో' కి చేరే దాని శక్తి (ఫోర్సు) పోను పోను తగ్గుతూ వుంటుంది. తర్వాత రాను రాను క్షీణించిపోతుంది. అంతేకాక రక్తస్రావం తగ్గుముఖం పడుతూ వుంటుంది. వ్యవధి - అంటే ముట్టుకూ, ముట్టుకూ మధ్యకాలం పెరుగుతూ వుంటుంది. మొదట్లో నెలనెలా వచ్చేదల్లా రెండు, మూడు, నాలుగు నెలలకు వస్తూ చివరికి ఆగిపోతుంది. ఇది సహజలక్షణం. కొందరిలో 'మెనోపాజ్' వైపరీత్యాలకు కూడా దారితీస్తుంది. కొన్ని సందర్భాలలో బహుష్టు 15 రోజులకు 20 రోజులకూ వస్తుంది. ప్రతిసారి 10, 15 రోజులదాకా రక్తస్రావం అధికంగా వుంటుంది. చిన్నసైజులో రక్తం కండలుగా పడిపోతూ వుంటుంది. ఒక 7 - 8 రోజులు కాగానే మళ్ళీ రక్తస్రావం మొదలయి కాళ్ళవెంటకూడా కారుతూనే వుంటుంది. పాద చిహ్నాలు కూడా పడ్డకేసులెన్నో వున్నాయి. ఈ పరిస్థితిలో 'ఫైబ్రాయిడ్ యూట్రస్' (గర్భాశయంలో వైపరీత్యం) అయి కేన్సరుగా మారిన కేసులు లేకపోలేదు. ఈ పరిణామానికి శస్త్రచికిత్సే శరణ్యం. వెంటనే గర్భసంచీ తొలగింపు (హిస్టరెక్టమీ) జరపాలి. అప్పుడే రక్తస్రావం కట్టుబడుతుంది. ముట్లుకూడా పోతాయి ఈ ప్రక్రియ అంతా అసహజ లక్షణంగా చెప్పుకోవచ్చు. ఈ పద్ధతివల్ల శారీరకమైన మార్పులు వచ్చి బాధిస్తాయని కొందరి భావన. అంటే ముందుగానే గర్భసంచి, ఓవరీలు వగైరాలు తొలగిస్తే, అందువల్ల ముట్లుపోతే స్త్రీలకు విపరీంతగా ఒళ్ళు లావైపోతుందని, కీళ్ళనొప్పులు వస్తాయని తద్వారా నడుము, వెన్నెముక సరిగా పనిచెయ్యవని ప్రచారం చేసేవారు లేకపోలేదు. దీనికి సరియైన రుజువులేదు. ఆపరేషన్ తర్వాత విపరీతంగా తిని, మిక్కుటమైన విశ్రాంతి తీసుకొంటే అలా జరుగుతుంది. దాన్ని వింత కథలుగా చెప్పుకోవడం కొందరికుండవచ్చు. అది పొరపాటు అని చెప్పాలి. ఇంకా నమ్మకం కుదరని అజ్ఞానులు డాక్టర్లసలహాలు పొందాలి.

అసలు సెక్సువాంఛను అంటే కామాన్ని ప్రకోపింప జేసేది మెదడు. అన్ని కోర్కెలను, అలవాట్లను కంట్రోలు చేసేదికూడా మెదడే. కనుక కామవాంఛను కూడా కంట్రోలు చేసేది మెదడే అయినప్పుడు మెనోపాజ్ వల్ల లైంగికేచ్ఛ తగ్గుతుందని చెప్పటం కష్టమని నిర్వచించాడొక సైకాలజిష్టు. అంతేకాదు ముట్లుడిగాక దాంపత్య జీవితం అనవసరమని మతాభిమానులైన స్త్రీలు భావిస్తారు. అందువల్ల భర్తను దూరం చేసుకోవటానికి ప్రయత్నిస్తారు. కొందరు భర్తను సంతోషపెట్టటానికోసం నటిస్తారు కాని నిజమైన ఆసక్తిని చూపరు. ఇది గ్రహించిన భర్తలు వ్యభిచరించినా ఆ స్త్రీలు పట్టించుకోరు. పైగా పీడ వదలినట్లు భావిస్తారు; కాని లో లో కృంగిపోతారు. ఈ పరిస్థితి కొన్ని సమయాల్లో దంపతులమధ్య విరోధ భావానికి దారితీస్తుందని ఆ శాస్త్రవేత్త ఒక పాఠంలో చెప్పాడు. కనుక ముట్లుడిగాక దాంపత్య జీవితం పరస్పర అవగాహన, ఆసక్తి, ఓర్పు నేర్పులమీద ఆధారపడి వుంటుంది. 'మెనోపాజ్' తర్వాత సెక్సు జీవితాన్ని సుఖవంతం చేసుకోవటానికి గాని, చికాకులతో కూడినటువంటి ఆవేదనా భరితమైనా జీవితాన్ని గడపటం కాని కేవలం భార్యాభర్తల మీద ఆధారపడి వుంటుంది. ఒకర్ని ఒకరు అర్థం చేసుకోవాలి, ఒకరి కొకరు త్యాగం చెయ్యటానికి సిద్ధపడాలి. ఒకరి కష్టసుఖాల్లో మరొకరు పాలు పంచుకోవాలి. యవ్వనంలో జీవితం అంతా ఆనందమయమే. సర్వశక్తులూ ఉడిగాకనే సమస్యలు ప్రారంభమవుతాయి. అప్పుడే అండదండలు, ఆప్యాయతా, అనురాగం, తోడూ నీడా కావాలి. అవన్నీ మన చేతిలోనే వున్నాయి. పరిస్థితుల్ని అర్థం చేసుకోగల విజ్ఞానం, వివేకం ధైర్యస్థైర్యాలు మనలో రావాలి. దానికి కొంత నీతి, నిజాయితి, వివేకంతో కూడిన పరిశీలనాదృష్టి మనలో ప్రోదిచేసుకోవాలి. ఆనాడే స్త్రీల సమస్యలు తీరిపోతాయి.



# స్త్రీ విముక్తి సిద్ధాంతాలు

స్త్రీల హోదాగురించి చరిత్ర పుట్టినప్పటినుండి అనేక సిద్ధాంతాలు, వ్యతిరేక వాదాలు ప్రబలంగా వుంటూనే వున్నాయి. సామాజిక వ్యవస్థ మారినా పాతకాలపు ప్రభావాలు ఆదర్శాలు బ్రతుకుతూనే వున్నాయి. మన భావాలు అంత తేలికగా నశించవు. 1966 లో చైనాలో మావో సాంస్కృతిక విప్లవాన్ని ప్రారంభించే సందర్భంగా ఈ వాదనకు బలం వచ్చింది. నాటి కన్‌ఫ్యూషియస్ ఆలోచనా విధానం సమాజంలో ఇంకా వ్రేళ్లూనికొని వున్నదని మావో అనాడు అంగీకరించక తప్పలేదు. రాజకీయాధికారం, మతాధికారం, పురుషాధిక్యత, జాతీయాధికారం ఈ నాలుగూ జమిందారీ పితృస్వామ్యలక్షణాలన్నాడు మార్క్స్. పురుషాధిక్యతను మార్క్స్ ప్రత్యేకంగా పేర్కొన్నాడు. 1917 లో రష్యాలో విప్లవం వస్తే 1983 లో రష్యన్ కార్మికుడు గృహిణికి ఇంటిపనిలో సాయపడటం లేదు. అమెరికన్ స్త్రీ అదనంగా మూడుగంటలు పనిచేస్తోంది. రష్యాలో రాజకీయ, కౌటుంబిక రంగాలలో స్త్రీ వెనుకబడివుంది. ఇక ఇండియాలాంటి దేశాల విషయం సరేసరి. స్త్రీ శారీరక నిర్మాణం, సమాజ నిర్మాణరీతి, చారిత్రిక పరిణామం, సాంస్కృతిక పద్ధతులు అన్నీ కలసి సమాజంలో స్త్రీ పాత్రను నిర్దేశిస్తాయి. అన్ని రంగాలలో స్త్రీ పురుష సమానత్వం కావాలి. ఆ పరిస్థితి ఏ దేశంలోనూ ఇంకా రాలేదు. దానికొరకై మహిళోద్యమాలు వివిధ దృక్కోణాలతో పరిశీలించి కార్యోన్ముఖులవుతున్నారు.

సామాజిక పరిణామాలను భావాలు నిస్సందేహంగా ప్రభావితం చేస్తాయి. అలాగే సామాజిక పరిణామం భావాలపై మహత్తర ప్రభావాన్ని చూపుతుంది. సమాజంయొక్క ఆర్థిక చరిత్రకు, భావాలకు, సిద్ధాంతాలకు గల సంబంధాన్ని విలువ కట్టడంలో అనేక రకాలుగా ఆలోచన సాగింది. మార్క్స్ సమాజం యొక్క ఆర్థిక వ్యవస్థకు ప్రాముఖ్యతనిస్తే, ఎం. ఎన్. రాయ్ ఆర్థిక వ్యవస్థనూ, భావాలను, సమతూకంగా చూచాడు. మార్క్స్‌ను కాదనకపోయినా 'కల్చరల్ రివల్యూషన్' అంటూ మావో భావాలను ఉన్నత స్థానంలో వుంచాడు. ఏదైనా ఉపరితలానికి అందరూ ప్రాధాన్యత నిచ్చారు.

ఈ ప్రపంచంలో మహిళోద్యమానికి అనుకూలురూ వున్నారు; ప్రతికూలురూ వున్నారు. అలాగే మహిళోద్యమానికి అనుకూలంగానూ, వ్యతిరేకంగానూ సిద్ధాంతాలు

ఉద్భవించి బహుకాలంగా ప్రజల మనస్సులపై పెత్తనం చేశాయి. కనుక ఈ సిద్ధాంతాలను గాఢంగా అధ్యయనం చేయడం అవసరం. ఒకసిద్ధాంతం వెనుకముఖం పట్టిందనుకున్నా మరో రూపంగా అది తలెత్తడం గమనిస్తూనే వున్నాం. పురుష దురహంకారం అంతతేలిగ్గా చావదు. పాతభావాలు సమసిపోవడానికి కాలం పడుతుంది. అవే మళ్ళీ మళ్ళీ తలెత్తి వ్యాప్తిచెంద ప్రయత్నిస్తాయి. కనుక పాత సిద్ధాంతాలను తరచి చూడడం వృధా ప్రయాస కాదు. నూతనంగా అవతరించే ప్రమాదాలను, అపాయాలను గుర్తించడం కూడా అవసరమనక తప్పదు. ప్రత్యాఘాతక పాత్ర వహించే స్త్రీ పురుషులు స్త్రీజన ప్రగతికి అడుగడుగునా అవరోధాలు కల్పించడానికి ప్రయత్నిస్తూనే వున్నారు. మహిళావిముక్తికోసం పోరాడే మహిళల నైతిక ధృతిని చెడగొట్టే నిమిత్తం వారు అనేక సిద్ధాంతాలను అల్లారు. విద్య, ఉద్యోగం, పరిపాలనా, ప్రభుత్వము లాంటి రంగాలలో స్త్రీలు సమానత్వాన్ని కాంక్షించరాదని ప్రచారం చేసేనిమిత్తం ఆమె శరీరనిర్మాణాన్ని, మనస్తత్వాన్ని సున్నితమైన భావాలను ప్రాతిపదికగా తీసుకొని వాదాలను సృష్టించారు.

సమాజ ఆవిర్భావ కాలంనుండి స్త్రీని ఇంటిలోకి నెట్టివేయడానికి ఆమె శరీర నిర్మాణ స్వభావాన్ని పురుషుడు తనవాదానికి ఆధారభూతం చేసుకున్నాడు. సంతానాన్ని కనగల ఆమె శక్తిని ఆమెకు ప్రకృతి ప్రసాదించిన విశిష్టవరంగాకాక ఆమెయొక్క అశక్తతా లక్షణంగా పరిగణించాడు. సంతానోత్పత్తికి మానవజాతిని కొనసాగించడానికి ఆమె ఉద్దేశింపబడినదట. అందువల్ల ఆ పవిత్ర ధర్మ నిర్వహణకే ఆమె తన శక్తినంతా వినియోగించాలట. విద్యలాంటి వ్యాసాంగాలపై ఆమె శక్తిని వృధా చేయరాదట. ఇలా సాగింది ప్రతికూలవాదం మొదట్లో. కాలం జరిగినకొద్దీ స్త్రీలకిచ్చే విద్య పురుషులకన్నా పూర్తిగా భిన్నంగా వుండాలనే వాదన పుట్టుకొచ్చింది. సంతానాన్ని కనడం ఆమె ప్రాథమిక కర్తవ్యం కనుక ఆమె పొందే విద్య అందుకనుగుణంగా వుండాలట. ఈ పై వాదనలన్నింటిని స్త్రీ విమోచనను ఆకాంక్షించే మహిళలు త్రిప్పికొట్టారు. స్త్రీకి పురుషుడికన్నా హెచ్చు శక్తిని ప్రకృతి ఇచ్చిందనీ, పురుషుడికన్నా పదిశాతం నిరోధకశక్తి స్త్రీకి వున్నదని వైద్యశాస్త్రం ఉద్ఘాటిస్తోంది. కనుక పైవాదనలో పసలేదని తేలింది.

## శారీరక నిర్ణయవాదం (Biological Determinism)

స్త్రీ పురుషసమానత్వాన్ని వ్యతిరేకించేవారు స్త్రీ పురుషుల శరీరనిర్మాణము, మెదడు పరిమాణము మొదలగు వాటి విషయకంగా ఉన్న తేడాను ఆధారం చేసుకొని ఈ వాదాన్ని లేవనెత్తారు. పురుషునికన్నా స్త్రీ యొక్క శారీరక బలం

తక్కువ కనుక వారిరువురు మధ్య సమానత్వం అసంభవమని వారి వాదన మానవుడు చేతితో చేసే పనిని యంత్రాలద్వారాను, మెదడుతో చేసే పనిని కంప్యూటర్ల ద్వారాను జరిపిస్తున్న ఈ శతాబ్దంలో శారీరకబలానికి విలువలేదని స్త్రీ విమోచన వాదులు జవాబు చెప్తున్నారు. స్త్రీ యొక్క మెదడు పురుషుని మెదడుకన్నా తక్కువ తూగుతుందని ఒక అంశాన్ని వెలికితెచ్చారు ప్రతికూలురు. మెదడు, శరీరము ఈ రెంటిబరువుల నిష్పత్తి విషయంగా స్త్రీ పురుషులలో తేడా లేదని మహిళలు ప్రతివాదన చేశారు. మెదడు పెద్దదిగా వున్నంతమాత్రాన ఏనుగు మనిషికన్నా తెలివికలదని చెప్పలేము కదా! వాస్తవానికి ఈ శారీరక నిర్ణయవాదం స్త్రీల స్వేచ్ఛాపిపాసను వమ్ముచేయటానికి పుట్టిందనేది నిర్వివాదాంశం అనకతప్పదు.

## సామాజిక పరిణామవాదం (Social Darwinism)

తిరోగమన వాదులు తమ అపజయాన్ని తేలికగా అంగీకరించరు. పరిణామ వాద శాస్త్ర మూలపురుషుడైన డార్విన్‌ను తమకు అండగా తెచ్చుకోవాలని ప్రయత్నిస్తూ వున్నారు. డార్విన్ సిద్ధాంతాలను వక్రీకరించారు. 'మనుగడకోసం పోరాటం, స్త్రీల సాంగత్యం కోసం పోటీ' జాతుల లక్షణమని డార్విన్ చెప్పాడు. జాతిలో బహు సంతానం కలిగిన జీవులు, తమచుట్టూవున్న పరిసరాలకు తట్టుకోగల జీవులు బ్రతుకుతాయని ఆయన చెప్పాడు. డార్విన్ ప్రకృతి వరణ సిద్ధాంతాన్ని చెప్తే వీరు లైంగిక వరణ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నారు. ప్రకృతి స్త్రీ పురుషుల మనస్తత్వాలలో తేడా ఏర్పరచిందని, పరిణామవాదం తమ సిద్ధాంతాన్ని సమర్ధిస్తున్నదని వారి వాదన. పురుషుని మేధాశక్తి స్త్రీ మేధాశక్తి కన్న గొప్పదని వారిభావం. మహిళోద్యమ కార్యకర్తలు ఈ వాదాన్ని తిరస్కరిస్తున్నారు. స్త్రీలయొక్క అంతఃకరణశక్తి పురుషుని శక్తి కన్నా అధికమైనది. మేధస్సును వినియోగించడానికి అవకాశాలను వెసులుబాట్లను శతాబ్దాల తరబడి స్త్రీకి లేకుండా చేసినందున ఆమె మానసికశక్తి, పురుషుని మానసిక శక్తి కన్నా తక్కువదిగా కనపడుతున్నది. సామాజిక పరంగా స్త్రీలను వేర్పాటుకు లోను చేయడంవల్లనూ, వారిని అన్యాయాలకు, అక్రమాలకు, దోపిడీలకు గురిచేయడంవల్ల కలిగిన ఫలితమిది. ఈ సామాజిక పరిణామవాద సిద్ధాంతము మహిళోద్యమానికి తీరనినష్టం కలిగించిందని స్త్రీ విమోచన వాదులు విశదీకరించారు.

## సామాజిక జీవశాస్త్రం. (Social Biology)

ఈ సిద్ధాంతం ప్రకారం స్త్రీ పురుషులమధ్య పోటీ వుంటుంది. సాధ్యమైనంత మంది స్త్రీలతో పొందు కలుగజేసుకొని ఎక్కువమంది సంతానాన్ని కనాలని పురుషుడు

వాంఛిస్తాడట. గర్భధారణ, ప్రసూతిలాంటి విషయాలలో ఎక్కువ శక్తిని వినియోగిస్తున్న స్త్రీ పురుషుడి శ్రమను, శక్తిని ఆసరాగా వుండాలని కోరుకుంటుందట. అలా స్త్రీ పురుషులు ఒకరినొకరు వాడుకోవాలని చూస్తారట. తమ పిల్లలకు తనే తండ్రినని నిర్ధారణకోసం స్త్రీని పురుషుడు తన సొంతం చేసుకుంటాడట. ఇలా స్త్రీ పురుషులు పోటీ పడతారట. ఈ సిద్ధాంతం అనుభవానికి దూరం. సమాజంలో సహకారము, పోటీ రెండూ ఏకకాలంలో సహజీవనం చేస్తున్నాయి. అలాగే సామరస్యం, సంఘర్షణ మిక్కుటంగా కనపడతాయి. దౌర్జన్యం, దురాక్రమణ, పురుషుల స్వాభావిక లక్షణాలని అందువల్ల పురుషులు సమాజంమీద పెత్తనం చేయడానికి అర్హులని ఈ సిద్ధాంతకర్తల అభిప్రాయం. పురుషులలో 'టెస్టొస్టెరోన్' అనే హార్మోను ఎక్కువగా వుండటంవల్ల పురుషస్వభావం అలావున్నదని వాదన చేస్తున్నారు. దీనికి జవాబుగా, పురుషాధిక్యత ప్రదర్శనవల్లనే ఆ హార్మోను పెరుగుదల పురుషులలో కన్పడుతున్నదని ప్రతివాదన వచ్చింది. సింహాలు వేటాడేటప్పుడు వ్యూహంపన్ని, ఎత్తులువేసి జంతువుమీద లంఘించేది ఆడసింహమేనని గమనించాలి. బాబూన్ కోతులలో మగకోతిని నాయకుడిగా ఎన్నుకోవడం భౌతిక పరిస్థితులనుబట్టి జరుగుతోంది. చారిత్రాత్మక, సాంస్కృతిక కారణాలవల్ల భౌతిక పరిస్థితులు మారగలవని గమనించాలి.

## సామాజిక భావనిర్మాణవాదం (Social Constructionism)

స్త్రీ పురుషులమధ్య సంబంధాన్ని జీవశాస్త్రం నిర్ణయించదని, జీవశాస్త్రంయొక్క సామాజికదృక్పథం నిర్ణాయకపాత్ర వహిస్తుందని ఈ సిద్ధాంతసారం. ఉ॥ బహిష్టు రక్తాన్ని గురించి, బహిష్టమయిన స్త్రీ యొక్క అపవిత్రతను గురించి పూర్వం అనేక మూఢవిశ్వాసాలు వుండేవి. ఈ విశ్వాసాలు స్త్రీని న్యూనత పరిచాయి. శాస్త్రీయ విజ్ఞానం పెరిగినతర్వాత ఈ అవాస్తవికభావాలు పటాపంచలవుతున్నాయి. ఈ సిద్ధాంతం సాంస్కృతిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నది.

## శారీరక, మౌలికసార సిద్ధాంతం (Biological Essentialism)

పుట్టుకతోనే పురుషునికి పురుషస్వభావం, స్త్రీకి స్త్రీ స్వభావం వస్తుందని దీనిభావం. పురుషుని మానసిక ప్రవృత్తి స్త్రీ యొక్క మానసిక ప్రవృత్తికంటే భిన్నమైనదట. ఇంతవరకు పురుషాధిక్య సమాజంలోను, పురుషుని పెత్తనంసాగే వాతావరణంలో స్త్రీలు పెరిగారట. ఇప్పుడు స్త్రీలు చైతన్యవంతులై స్త్రీత్వంయొక్క గొప్పతనాన్ని గుర్తించాలట. గట్టిగా ఆలోచిస్తే ఈ సిద్ధాంతమూ, శారీరక నిర్ణయ

వాదమూ బొమ్మా బొరుసూ లాంటివని తేలుతుంది. కాగా ఈ సిద్ధాంతాన్ని మహిళోద్యమ కార్యకర్తలు ప్రతిపాదిస్తున్నారు. శారీరక నిర్ణయవాదాన్ని పురుష దురహంకారవాదులు ప్రచారం చేస్తున్నారు. కాగా రెండూ స్త్రీ పురుషుల మధ్యనున్న శారీరక విభేధాల ప్రాతిపదికమీదనే ఆధారపడుతున్నాయి.

ఈనాడు ప్రబలంగా వున్న స్త్రీవిమోచన సిద్ధాంతాలు నాలుగు. ఉదారవాద స్త్రీవిమోచన సిద్ధాంతం, మార్క్సిస్టు స్త్రీవిమోచన సిద్ధాంతం, రాడికల్ స్త్రీవిమోచన సిద్ధాంతం, సోషలిష్టు స్త్రీవిమోచన సిద్ధాంతం అనేపేర్లతో అవి చలామణి అవుతున్నాయి. ఈ సందర్భంగా హ్యూమనిష్టు స్త్రీవిమోచన సిద్ధాంతాన్నికూడా చర్చించటం అవసరం.

స్త్రీవిమోచన సిద్ధాంతాలు వైవిధ్యంగావున్నా, మార్గాలు వేరయినా లక్ష్యమూ ధ్యేయమూ ఒకటే. ప్రపంచంలోని ఈ స్త్రీ విమోచనోద్యమ కార్యకర్తలు నాలుగు తెగలుగా వుంటూ అన్ని శాఖలవారు స్త్రీవిమోచనోద్యమంలో చురుకుగా పనిచేయడం గమనార్హం.

## ఉదారవాద స్త్రీవిమోచన సిద్ధాంతం (Liberal Feminism)

జీవితంయొక్క అన్ని రంగాలలోను అంటే సామాజికార్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలన్నింట స్త్రీ పురుషులమధ్య సమానత్వాన్ని కోరుతుంది ఈ సిద్ధాంతం. మామూలుగా వోటుహక్కు, విద్యా ఉద్యోగ పరిపాలనా ప్రభుత్వ రంగాలలో సమానస్థాయి ప్రాతినిధ్యం ఆశిస్తారు ఈ సిద్ధాంతాన్ని సమర్థించేవారు. ఇప్పటివరకు పురుషులకు మాత్రమే ప్రవేశార్హత ఉన్న ఉద్యోగాలన్నింటిలో పురుషులతోపాటు పోటీ పడమని స్త్రీలను వీరు ఉద్బోధిస్తారు. గర్భస్రావపు హక్కు కోసం వారు ఆందోళనచేస్తారు; కుటుంబనియంత్రణను ఆమోదించి ఆచరణలో పెడ్తారు. సమాజానికి, పరిసరాలకు ప్రాధాన్యతనిచ్చేవారు వీరివాదనను విమర్శిస్తారు. సామాజిక వాతావరణము లేక సామాజిక వ్యవస్థ మౌలికంగా మారేవరకు స్త్రీల పురోగతి సాధ్యంకాదని విమర్శకులభావం. ఉదారవాద స్త్రీవిమోచనకారులు సామాజిక వ్యవస్థను మార్చదలచకపోయినా కొంతమేరకు స్త్రీవిమోచనకు వారి కార్యక్రమాలూ, ప్రయత్నాలూ తోడ్పడుతున్నాయి; ఆ మేరకు వారు అభినందనీయులు.

## మార్క్సిస్టు స్త్రీవిమోచన సిద్ధాంతం. (Marxist Feminism)

ఈ సిద్ధాంతం కుటుంబంలో జీవశాస్త్రపు పాత్రను అంగీకరిస్తుంది. ఉత్పత్తి సాధనాల స్వభావంపై సమాజం ఆధారపడుతుందనికూడా చెప్తుంది ఈ వాదం. దీనికి

మూలపురుషులు మార్క్స్,ఎంగెల్సులు. స్త్రీ పురుషులమధ్య శారీరక విభేదాలు స్త్రీ పురుషుల పని విభజనకు దారి తీశాయని అంటుంది ఈ వాదం. స్త్రీకి గర్భధారణ, ప్రసూతి సహజ ధర్మాలయినందున అవి పురుషాధిపత్యానికి దారి తీశాయి. మాతృస్వామ్య వ్యవస్థ పోయి పితృస్వామ్య వ్యవస్థ వచ్చింది. పారిశ్రామికీకరణ జరిగి, సోషలిజం వచ్చినతర్వాత పురుషాధిపత్యం సమసిపోతుంది అంటుంది మార్క్సిస్టుఫెమినిజం. ఈ వాదాన్ని సమర్థించేవారు స్త్రీలకు విజ్ఞప్తిచేస్తారు "సోషలిజం వచ్చేవరకు పురుషులపై మీ పోరాటం ఆపండి" అని. ఆర్థిక స్వాతంత్ర్యం వస్తే దానంతటదే స్త్రీకి సర్వేసర్వత్రా స్వేచ్ఛ లభిస్తుందని వారి ఆశ. ఈ దృక్పథాన్ని సోషలిస్టు స్త్రీవిమోచనోద్యమకారులూ (Socialist Feminists), తదితరులూ ఇలా విమర్శిస్తున్నారు. సోషలిస్టు దేశాలలో పురుషులు పురుషదురహంకారాన్ని విడనాడుతున్న సూచనలు కొనరావడంలేదు. పైగా పారిశ్రామిక కార్మికులు తమ స్త్రీలను సమాన హోదా కలవారినిగా చూడటంలేదు.

సనాతన సంప్రదాయ కమ్యూనిస్టులందరూ ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తూవున్నారు. సృజనాత్మక మార్క్సిస్టులు ఈ వాదాన్ని ఆమోదించటంలేదు. ఆచరణలో మావో ఈ వాదాన్ని త్రోసిరాజన్నాడు.

ఈ సిద్ధాంతంయెడ విమర్శ ఇలా సాగింది. భౌతిక పరిస్థితులను గమనించకుండా ఏంగెల్సు మనస్తత్వానికి ప్రాధాన్యత ఇచ్చాడు. స్త్రీ పురుషుల మధ్య పని విభజన జీవశాస్త్ర సంబంధంగా జరగలేదు. శారీరకబలం విషయంగా స్త్రీ పురుషుల మధ్యగల తేడా స్త్రీ యొక్క పనిని నిర్ణయించటంలోగాని, ఆమె అసమానస్థితికిగాని కీలకాంశంగా లేదు. సమాజం పారిశ్రామికీకరణ కాకముందు స్త్రీ ఇంటిలోగాని పొలంలోగాని బండెడు చాకిరీ చేయక తప్పలేదు; అందుకు ఆమె శారీరక బలహీనత అడ్డురాలేదు. యాంత్రికరణ పద్ధతివలన స్త్రీలకు ఉద్యోగాలు పోతున్నాయి. మొదటిదెబ్బ వారికి తగులుతున్నది. స్త్రీలకు తక్కువ వేతనాలు లభిస్తున్నందున వారు పురుషులపై ఆర్థికంగా ఆధారపడటం తప్పటంలేదు. శ్రామికులలో వారూ సగభాగం ఉన్నా స్త్రీలకు సమానత్వం లభించడంలేదు. స్త్రీల తక్కువ బలాన్ని వారికి తక్కువ వేతనాలు ఇవ్వడానికి కారణంగా చూపిస్తున్నారు.

## సోషలిస్టు స్త్రీవిమోచన సిద్ధాంతం. (Socilist Feminism)

మార్క్సిస్టు విమోచనవాదం యొక్క లోపాన్ని వీరు సవరించుకుంటారు. వీరికి ఉదారవాద సిద్ధాంతం సరిపడదు; దానితో వారు తృప్తిపడరు. అలాగే

మార్క్సిజాన్ని స్త్రీవిమోచనోద్యమానికిగాని, స్త్రీవిమోచనోద్యమాన్ని మార్క్సిజానికి గాని లొంగిఉండేటట్లు చేయరు సోషలిస్టు స్త్రీవిమోచనోద్యమకారులు. కుటుంబంలో స్త్రీయొక్క ప్రతిపత్తి ఉత్పత్తి సాధనాల స్థితిగతులలో సరాసరి ముడిపడి ఉండకుండా సాపేక్షంగా స్వతంత్రంగా నిర్ణయింపబడుతుందని వీరివాదన. లైంగిక అసమానత్వానికి ఆర్థికత ముఖ్యకారణమని వీరు అంగీకరించరు. కాగా వీరిలో చాలమంది మార్క్సిస్టు బంధాలను విడలేకుండా ఉన్నారు.

## రాడికల్ స్త్రీవిమోచనోద్యమం (Radical Feminism)

ఉదరవాద స్త్రీవిమోచనోద్యమకారులూ, మార్క్సిస్టు స్త్రీవిమోచనోద్యమకారులూ శారీరకాంశాలకన్న సామాజికాంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు. రాడికల్ స్త్రీవిమోచనోద్యమ సిద్ధాంతంలో జీవశాస్త్రం ఎక్కువ ప్రాధాన్యత వహిస్తుంది. పురుషుని శారీరక బలాధిక్యత, సంతానోత్పత్తి విషయంగా స్త్రీయొక్క పాత్ర ఈ రెండూ స్త్రీని సమానస్థితికి దూరం చేశాయని వారి విశ్వాసం. స్త్రీ పురుషుల మధ్య వర్గవిభజన, రాజకీయ విభజన ఉన్నాయని వీరివాదం. స్త్రీల విప్లవం రావాలని వీరి ఆకాంక్ష. స్త్రీవిమోచనకు ద్వితీయస్థానం ఇచ్చినందుకు మార్క్సిస్టులను వీరు విమర్శిస్తారు. వీరిదృష్టిలో స్త్రీలు ఒకవర్గం. వీరు 'శారీరక మౌలికసార సిద్ధాంతం' పై ఆధారపడతారు.

## సాంస్కృతిక స్త్రీవిమోచన సిద్ధాంతం. (Cultural Feminism)

ఈ సిద్ధాంతం రాడికల్ ఫెమినిజానికి చాల దగ్గరగా ఉంటుంది; కాకపోతే కొద్దితేడాలున్నాయి ఈ సిద్ధాంతం మహిళాసంస్కృతిని శ్లాఘిస్తుంది. స్త్రీయొక్క సృజనాత్మకశక్తిని, సంతానోత్పాదనలో ఆమె సామర్థ్యాన్నిచూచి పురుషుడు ఈర్ష్య పడుతున్నాడని వీరి అభిప్రాయం. విప్లవ స్త్రీవిమోచన సిద్ధాంతాన్ని ఇది ప్రతిపాదిస్తూ వుంది. సంతానోత్పాదనలో స్త్రీ పాత్రను పురుషుడు మానసికంగా గ్రహించే విధానంపై ఆమె అణగారినతనం ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని ఆధారపడుతుందని వీరిభావం. ఈ అంశంమీద రాడికల్ ఫెమినిస్టులకూ సాంస్కృతిక ఫెమినిస్టులకూ ఏకీభావమే. స్త్రీవిమోచనకు ప్రధానశత్రువు పురుషుడేనని వీరి నిర్ణయం. రాడికల్ ఫెమినిస్టు అయిన 'ఫైర్‌స్టోన్' పురుషులతో సంపర్కంలేకుండా కృత్రిమ గర్భధారణకు పూనుకోవలసినదని స్త్రీలకు విజ్ఞప్తి చేస్తున్నది. సాంస్కృతిక ఫెమినిస్టు అయిన 'రిచ్' అనే ఆమె "సంతానోత్పాదన" గురించి గర్వపడవలసిందని స్త్రీలకు ఉద్బోధిస్తున్నది. ఈ రెండు శాఖలవారూ శారీరక మౌలికసార సిద్ధాంతాన్ని ఆమోదిస్తారు. అంటే స్త్రీకుందే సృజనాత్మకశక్తిని చూచి పురుషజాతి అసూయజెంది

వారిని అణచివేయ పూనుకున్నదని ఈ వాదన ముఖ్యాంశం. ఈ వాదనను అంగీకరించే వారు పురుషజాతిని ద్వేషిస్తారు. పురుషజాతిని 'పురుషదురహంకార సూకరాలు' (Male Chauvinist Pigs) అని మెక్సికో ప్రపంచ మహిళాసభలో ఎలుగెత్తి నిందించడం జరిగింది. వీరి సిద్ధాంతంలో ముఖ్యమైనది స్త్రీలకు స్త్రీత్వలక్షణాలను ప్రకృతి ప్రసాదించిందని, వాటిని పురుషుల మానసికలక్షణాలకన్నా గొప్పవిగా పరిగణించాలని అంతగా కాకపోతే సమానముగా లెక్కలోకి తీసుకోవాలని వీరి విశ్వాసం. 'డన్‌బార్' అనే ఆమె సామాజిక విముక్తికి మూలం స్త్రీ విమోచనయే అని ప్రకటించింది. స్త్రీత్వలక్షణాలు అంటే ఇతరులయెడ శ్రద్ధ, జాగ్రత్త, ఆత్మ విశ్వాసం, పోటీలేని మనస్తత్వం, సహకారం, ఐహికతత్వం (Materialism) ఇవి ప్రపంచానికి అవశ్యకమని వీరిభావన.

స్త్రీవిమోచనను గురించిన ఈ తాత్విక సిద్ధాంతాలన్నీ అర్ధసత్యాలే; వాటిలో కొంత వాస్తవం ఉన్నది; వాటిని పూర్తిగా అంగీకరించడానికి వీలులేదు. స్త్రీ పురుషునికి లొంగిఉండటం అనే ఈనాటి వాస్తవానికి శారీరకశాస్త్రం, మానసికశాస్త్రం, సామాజికశాస్త్రం, ఆర్థికశాస్త్రం, సామాజిక పరిణామవాదం, సామాజిక జీవశాస్త్రం వీటిలో ఏ ఒకటీ సరియైన సంజాయిషీ ఇవ్వలేదు. ఏ ఒక్క అంశాన్నో ఆధారం చేసుకుని దానిని వివరించలేము. రాజకీయ, ఆర్థిక, జీవశాస్త్రం, మానసికశాస్త్రం, సామాజికభావన అన్నీ స్త్రీలను పురుషులూ, సమాజం దోపిడీ చేయటానికి ఉపకరించాయి. కేవలం మార్క్స్‌గాని, ఫ్రాయిడ్‌గాని స్త్రీల సమస్యలకు పరిష్కార మార్గాలను చూపలేరు బహుముఖంగా సమస్యను దర్శించవలసి వుంటుంది. సమ్యక్ దృక్పథం నేడు అవసరం. ఏదో ఒక సిద్ధాంతాన్ని ముందుగా ఊహించుకుని తద్వారా పరిష్కారమార్గాన్ని అన్వేషించపూనడం అవివేకం; అలాంటి ప్రయత్నం నిష్ఫలం అవుతుంది. మానవవ్యక్తి సంక్లిష్టజీవి. మానవ స్వభావాన్ని లేక పెరుగుదల క్రమాన్ని అవగాహన చేసుకోవాలంటే గాఢంగా సునిశితంగా విశేషణాయుతంగా పరిశీలన అవసరం; అదీ మానవవాద ప్రాతిపదికపై జరగాలి. ఈ అంశంపై శాస్త్రీయభావనను, శాస్త్రీయదృష్టిని ప్రసరింపచేయాలి. అలాంటి ప్రయత్నానికి మానవవాద దృక్పథంతో కూడిన స్త్రీ విమోచన సిద్ధాంతం ఉపకరించవచ్చును. కనుక హ్యూమనిస్ట్ ఫెమినిజం స్వరూపస్వభావాలను పరిశీలిద్దాం.

## మానవవాద స్త్రీవిమోచన సిద్ధాంతం. (Humanist Feminism)

ఈ సిద్ధాంతం వాస్తవికతపై ఆధారపడి సమగ్ర పరిశీలనవల్ల పుట్టి సమ్యక్ దృక్పథంతో భాసిల్లుతుంది. సంతానోత్పాదన విషయంలో స్త్రీ శక్తిసంపన్నతను గుర్తిస్తుంది. దానిని ఆమె బలహీనతగా పరిగణించదు. కుటుంబ పెంపుదలకు సామాజికశాశ్వ తత్వానికి ఆమె చేసే అపూర్వసేవగా లెక్కలోకి తీసుకుంటుం కనుక ఆమెను అభినందిస్తుంది. గర్భధారణ సమయంలోకాని, ప్రసూతి సందర కాని ఆమెకు కలిగే కొద్దిపాటి ఇబ్బందిని, చికాకును సాకుగా తీసుకొని (

అన్యాయం చేయదు. ఆ సమయంలో ఆమెకు అండగా నిలబడాలని పురుషుడిని ఉద్బోధిస్తుంది. ఇంటిపని, పిల్లల పెంపకంపని ఆమెకే కేటాయించడం అక్రమమని వాదిస్తుంది. స్త్రీ పురుషుల మేధాసంపత్తిలో తేడాలు, వ్యత్యాసాలు లేవని స్త్రీ పురుషునితో సమఉజ్జీగా వ్యవహరించగలదని నొక్కిచెప్తుంది. స్వేచ్ఛ సమగ్రమూ, సంపూర్ణమూ కావాలి. స్త్రీకి సామాజిక స్వేచ్ఛ వున్నంతమాత్రాన చాలదు. అలాగే ఆర్థికస్వేచ్ఛ లభించినంతమాత్రాన ఒరిగేదిలేదు. రాజకీయ సాంస్కృతిక స్వేచ్ఛలూ అవసరమే. ఒక రంగంలో స్వేచ్ఛ అనుభవిస్తూ మరోరంగంలో ఏ వ్యక్తి కట్టు బానిసగా వుండలేడు. ఈ సత్యాన్ని గుర్తించి, సామాజిక వ్యవస్థయొక్క ప్రాధాన్యతనూ దానిపై నిర్మింపబడిన భావప్రపంచాన్ని రెంటినీ సమానంగా పరిగణించే ఏ సమస్యనైనా అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించడం అవసరం. ఈ సిద్ధాంతాన్ని సమర్థించేవారు రాడికల్ ఫెమినిస్టులవలె పురుషద్వేషానికి లోనుకారు. మార్క్సిస్టు ఫెమినిస్టులవలె స్త్రీవిమోచనోద్యమాన్ని ఆర్థికపోరాటాలకు బలిచేయరు. అంటే పురుషాధిపత్యంమీద జరిపే పోరాటము, సామాజిక వ్యవస్థ మార్పుకై సాగించే ఆందోళన ఏకకాలంలో జరుపుతారు. ఉదారవాద ఫెమినిస్టులవలె పెట్టుబడిదారి సమాజ వ్యవస్థను ఆమోదించి ఊరుకోరు. మార్క్స్, ఫ్రాయిడ్‌లాంటి మహా మేధావుల సిద్ధాంతాలలోని వాస్తవాంశాలను మాత్రం స్వీకరించి జీవితానుభవంతో రంగరించుకొని ముందుకు సాగిపోతారు. భవిష్యత్ ప్రపంచంలో కండబలానికన్నా బుద్ధిబలానికి ప్రాధాన్యత వున్నదన్న అంశాన్ని గుర్తెరిగి నూతన సమాజ ఆవిర్భావంకోసం భావవిప్లవాన్ని ఆకాంక్షిస్తారు. కేవలం భావాలమార్పువల్ల సమస్య పరిష్కారంకాదని వారికితెలుసు. కనుకనే భావవిప్లవాన్ని సామాజిక పరివర్తనా కార్యక్రమాన్ని ఏక కాలంలోసాగిస్తారు. అలా స్త్రీవిమోచనోద్యమాన్ని సామాజికవిప్లవపంథాను సమన్వయిం చేస్తారు. ఈ మార్గం అనుసరణీయమని గ్రహించడం అత్యవసరం. ఈ సమస్యను మానవవాద పరిధిలో పరిశీలించి దీన్ని పరిష్కరించటానికి బహుముఖకృషి జరుగ వలసివుంది. సిద్ధాంతాలకన్నా జీవితం వాస్తవమైనది; విలువైనది. జీవితపు లోతులను అవలోకనం చేసినకొలది నూతనసత్యాలు గోచరిస్తాయి. నూతనసిద్ధాంతాలు మొలకెత్తు తాయి. కనుక అర్థసత్యాలైన మొదటి నాలుగు స్త్రీవిమోచన సిద్ధాంతాలను అంటిపెట్టు కొని ప్రాకులాడక స్త్రీని మానవిగా పరిగణించే మానవవాద స్త్రీవిమోచన సిద్ధాంతాన్ని పూర్తిగా రూపొందించటం ఆదరించటం అవశ్యకర్తవ్యం. అది నూతన సమాజావిర్భా వానికి నాంది పలుకుతుంది.

వర్గపోరాటం పేరుతో స్త్రీవిమోచనోద్యమాన్ని అణచిపెట్టటం తప్పు. అలాగే స్త్రీవిమోచన పేరుతో సమాజంలోని దోపిడీపద్ధతులను గుర్తించకపోవటం పొరపాటు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, కౌటుంబిక రంగాలన్నిటా స్త్రీవిమోచనకు అరమరికలు లేకుండా కృషిచేయడం మనకర్తవ్యం. ఈ సందేశాన్ని మానవవాద స్త్రీవిమోచన సిద్ధాంతం ప్రతిపాదిస్తుందని గ్రహిద్దాం. ●

# భారత నారీ ఆదర్శం!

"భారతస్త్రీ హోదా చాలా పవిత్రమైనదని, ఉన్నతోన్నతమైనదని, శాశ్వత మైనదనే వాదన అభూతకల్పనేకాదు. మోసపూరితంకూడా. ఇంతవరకు స్త్రీ పురుషులు కలిసి జీవించినా వారిది వాస్తవసహచర్యంకాదు. వారిసంబంధాలలో వున్న శాంతి స్త్రీకి వ్యక్తిత్వంలేనిశాంతి. అంటే అది స్మశాన శాంతి. అనాదినుండి పురుషుడు అధికుడు, స్త్రీ అల్పురాలు అనే భావంతో స్త్రీ శక్తిని పురుషుడు దోస్తున్నాడు. శాసనాలలో, ఆచారాలలో, ఆచరణలో యజమాని బానిస అనే దృక్పథం, ఆధిక్యత, న్యూనత అనే భావం ద్యోతకమవుతున్నాయి. భారతస్త్రీ ఆధారపడి జీవించే ప్రాణి. భారతనారీ ఆదర్శం స్త్రీలు కోరి తెచ్చుకొన్నదికాదు ఆ గుదిబండ ఆమె మెడకు కట్టబడింది. స్త్రీ పురుషుల సంబంధం సమానత్వంపైనా, న్యాయంపైనా నిర్మించినపుడే వాస్తవమైన శాంతి, సామరస్యం, సహచర్యం వుంటై" అని ఇప్పటికి 50 సం॥ క్రిందటే నిర్వచించాడు నవ్యమానవవాద తత్వవేత్త ఎం. ఎన్. రాయ్ భారతనారీ ఆదర్శం అనే గ్రంథంలో.

స్త్రీ గృహదేవత. త్యాగమూర్తి, ఆధ్యాత్మిక జీవితంలో సమాన భాగస్వామి అంటూ ఆమెకు మహోన్నతస్థానం ఇచ్చామంటున్నారు సనాతనులు. ఇదంతా ఆమె దాస్యానికి బంగారుపూత అని అధిక్షేపించాడు రాయ్. వివాహబంధం చాలా పవిత్ర మైనదని, స్త్రీ జీవాన్ని తయారుచేసే క్షేత్రమని అభివర్ణిస్తున్నారు. కాని అది స్త్రీకి బానిసత్వమని, ఆమె బిడ్డల్నికనే యంత్రమంటూ విమర్శించాడు. అంతేకాదు మతం నిర్ణయించిన విధులను, సాంఘికాచారాలను, స్త్రీ కొరకు నిర్దేశించిన బాధ్యతలను, నెరవేర్చే షరతుతో వరుడు కన్యను స్వీకరిస్తాడు. త్యాగం, భక్తి, విశ్వాసం విధి నిర్వహణలతో కూడిన జీవితాన్ని స్త్రీలు గడపాలి. అలా మహిళలు సంప్రదాయాలకు, మూఢవిశ్వాసాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. వివాహఎన్నికలో, లైంగిక సంబంధాలలో, విడాకులలో సైతం స్త్రీలకు సంపూర్ణస్వేచ్ఛ లేదని వ్యక్తీకరించాడు. కన్యాదానాన్ని నిరసిస్తూ అంతవరకు కన్యపై తండ్రికున్న యాజమాన్యపుహక్కును భర్తకు సంక్రమింప జేయడమేనని స్పష్టీకరించాడు. ఉత్పత్తి సాధనాలను యజమాని జాగ్రత్తపరచుకుంటున్నట్లే భార్యను పోషిస్తున్నాడని వ్యాఖ్యానించాడు. పైకి అర్ధాంగి అంటూ సమానహోదా ఇవ్వలేని ఈ ప్రేమఅంతా యజమానికి మచ్చిక గొడ్లపైవుండే అభిమానంతో సమానమని, నిజమైన త్యాగము, అనురాగము కాదని వాదించాడు. బహుభార్యత్వాన్ని, విడాకులకు అవకాశంలేని వివాహబంధాన్ని క్రూరత్వంగా చిత్రించాడు. బహుభార్యాత్వాన్ని నిషేధం చేయించుకోలేకపోతే బహుభర్తృత్వపు

హక్కులను కోరండని స్త్రీలకు హితవుచెప్పాడు. (అంటే సమానత్వ ప్రాతిపదిక కోసం ఆ భావంకాని మరొకటికాదు. ఆనాడు హిందువులలో కూడా బహుభార్యాత్వం అమల్లో వుండేది.)

సంకకత్వం స్త్రీని యావజ్జీవ పరాధీనగా బ్రతుకనిస్తోంది. ధర్మశాస్త్రజ్ఞులు విషం క్రక్కుతూ స్త్రీకి అపచారం చేశారు. మనువు ఆ కాలానికి పనికివచ్చే శాసనాలు చేసివుండవచ్చు. కాని భారతసమాజం ఆధునికీకరణం కాక తప్పటంలేదుకదా! మరి ఈ కాలంలోకూడా స్త్రీకి ప్రాధమికహక్కులివ్వలేని సంప్రదాయపు భావాలను పురాతన వ్యవస్థను అంటిపెట్టుకొని స్త్రీలు వుండాల్సిందేనా? అని రాయ్ సంప్రదాయాలను సవాల్‌చేస్తూ ప్రశ్నించాడు.

"పురుషుడు పురుషుడే; స్త్రీ స్త్రీయే ప్రకృతి సృష్టిని మార్చలేము. మీది ఉదాత్తమైనవృత్తి. ఆ పవిత్రతాధర్మంలో మీతో ఎవరూ పోటీచేయలేరు. కనుక మీరు జీవనపోరాటంలో మాతో పోటీ పెట్టుకోకండి." అంటూ స్త్రీలకు పురుషులపై విరోధముండరాదని పగతీర్చుకోవాలని ప్రయత్నించవద్దని సనాతనులడుగుతున్నారు. వారు పూర్వపు తమ నడతకు తామే భయపడుతున్నారు. అయినా ఆధునిక స్త్రీలు పురుషులపై తిరుగబడుటలేదు. స్త్రీలను అణిచిపెట్టే సాంఘిక నియమాలకు, ఆర్థిక ఇబ్బందులకు, వారు వ్యతిరేకంగా పోరాటం సాగిస్తున్నారు. కాని ఏ స్త్రీ కూడా భౌతికమైన, లైంగికమైన మార్పు కోరటంలేదని, పురుషత్వాన్ని వాంఛించటంలేదని సమానత్వాన్ని మాత్రమే అభిలషిస్తున్నారని రాయ్ విశదీకరించాడు. అసలు స్త్రీ పురుషులమధ్య వైరాన్ని ఏనాడూ స్త్రీలు కోరలేదని ఈ అసమానత్వపు వ్యవస్థమీదనే వారి తిరుగుబాటని వివరించాడు. ఇన్నాళ్ళూ స్త్రీలపై చేసిన దౌర్జన్యాలకు, దోపిడికి, అణచివేతకు ప్రతిఫలంగా తమకు ఏమిమూడుతుందోనని పురుషులు భయపడుతున్నారు. వాస్తవస్వేచ్ఛకు స్త్రీలు ప్రయత్నిస్తుంటే పాతవ్యవస్థను పరిరక్షించాలనే ఛాందసులు తాము భయపడుతూ వారిని తీవ్రవాదులుగా అభివర్ణిస్తున్నారు; కుటుంబ శాంతి విధ్వంసులగా తిట్టిపోస్తున్నారు. ఈ ఆధునిక వ్యవస్థ అను కొలనులోని ప్రతి అలను చూచి తుఫానొస్తుందని భయపడుతున్నారు సనాతనులు.

ఇంతవరకు స్త్రీకి బానిసత్వము, ఉంపుడుగత్తెలాంటిస్థాయి, పురుషుడికి లోబడి వుండుటలాంటివి పత్నీధర్మాలుగా మతంద్వారా, పురాణాలద్వారా పెద్ద ప్రచారం జరిగాయి. ఇవన్నీ స్త్రీ త్యాగానికి చిహ్నాలుగా చెప్పబడ్డాయి. ఇదంతా నిజమని నమ్మినస్త్రీలు వారి బంగారు సంకెళ్ళకు వారే మురిసిపోయ్యారు. అదిచాలక ఇంకా తా సావిత్రులకథలు ఆదర్శాలుగా పాటించారు. భర్తల కోరికలపై పిల్లల్నికనడం 'గించారు. నేడు ఆ 'స్వర్ణయుగం' గతించింది.

ఇకముందు మధ్యతరగతి స్త్రీలుసైతం ఉద్యోగాలుచేస్తూ కుటుంబభారాన్ని మోయకతప్పదు. ఈనాడు కార్మికవర్గస్త్రీలు గృహిణులుగా, పిల్లల్నికనే యంత్రాలుగా, భారముమోసే పశువులుగా పనిచేస్తూకూడా పురుషాధిపత్యానికి తలఒగ్గుతున్నారు. కాని ఆనాటి సాంఘిక వ్యవస్థ నేడు బీటలు వారింది. ఆ పునాదిపై నిర్మింపబడ్డ సాంస్కృతిక భవనం కూలుతోంది. ఈ మార్పును గ్రహించికూడా శాసనాలు, సాంఘిక విధానాలు మారనిచో బాధపడేవారు (స్త్రీలు) తిరుగుబాటు చేస్తారు. అప్పుడా తిరుగుబాటును ఆపడం దుస్సాధ్యమవుతుంది.

ఎం. ఎన్. రాయ్ 1937 లో స్త్రీలగురించి రాసిన నగ్నసత్యాలు ఈనాటికీ కాదనలేని జీవితసత్యాలు. భారతస్త్రీ ఆదర్శం సంతానం కనడం మాత్రమే కాదన్నాడు. సమానత్వం కోరకుండా సాహచర్యాన్ని ఆశించడం తగదన్నాడు. వివాహమంటే విహారయాత్ర కాదని ఇద్దరూ సమానభాగస్తులనే క్రమశిక్షణ కావాలని హెచ్చరించాడు. వివాహసందర్భంగా, ఉద్యోగరీత్యా, కుటుంబనిర్వహణలో స్త్రీకి స్వేచ్ఛకావాలని అహరహం, జీవితాంతం తపించాడు. సామరస్యం లేనప్పుడు విడిపొయ్యేహక్కు, భర్తను ఎన్నుకొనేహక్కు, ఆర్థికస్వేచ్ఛ ఆమె ప్రాథమికహక్కులు కావాలన్నాడు.

పాతవ్యవస్థ నశించేస్థితిలో ఆధునికబీజాలు నాటితేనే పురోగతివుంటుంది. అందుకు సమూలమార్పు అనివార్య మవుతుంది. కనుక పాతవ్యవస్థను త్రోసి రాజంటున్నా రేకాని కుటుంబ విచ్ఛిత్తిని, సాంఘిక అరాజకత్వాన్ని నేటిస్త్రీలు కోరుతున్నారనేది పొరపాటు. నేటిస్త్రీలు మౌలికమైన మానవహక్కుల కొరకై ఆరాటపడుతున్నారు. అంటే వారిఅభివృద్ధికి ఆటంకమైన మానవనిర్మిత ధర్మశాస్త్రాలను, బూజుపట్టిన సంప్రదాయాలను తొలగించుటకై తపన పడుతున్నారు. తమను విలాసవస్తువుగా కేవలం సెక్సుసింబల్‌గా వాడుకునేహక్కు ఎవరికీ లేదని ఎలుగెత్తి అరుస్తున్నారు. పురుషులతోపాటు సమానభాగస్వాములుగా, సహచరులుగా సంచరించే స్వేచ్ఛ కావాలని అడుగుతున్నారు. ఆ నాటి స్త్రీల నరనరాన జీర్ణించిన భావదాస్యంవల్ల నేటి ఆధునికస్త్రీలు మోసపోరాదనే విజ్ఞానాన్ని పొందుతున్నారు. ఇదొక సంధియుగం. పాతకొత్తల కలయికల సమ్మేళనం. భావపునర్వికాసానికి నాంది నేటి స్త్రీలలో కలుగుతోంది. ఒకసారి వెలిగిన జ్ఞానజ్యోతి ప్రజ్వరిల్లుతుందేకాని ఆరిపోదు. అందుకు రాయ్‌వంటి మేధాసంపన్నులభావాలే పునాదిరాళ్ళు. న్యాయంగా చెప్పాలంటే సహగమనాన్ని అంతమొందించిన ఘనత రాజారామ్మోహనరాయికి దక్కితే హిందూ స్త్రీలలో ఆరని విజ్ఞానజ్యోతిని వెలిగించిన ఘనత ఎం. ఎన్. రాయికి దక్కుతుంది.



# నేనెవరో తెలుసా?

నే పుట్టానొక చీకటి గొడ్లపాకలో
అయ్యో! అంటూ ఏడ్చింది అమ్మ
బాబో! అంటూ తలపట్టుకున్నాడు నాన్న.
మా తలరాత అన్నది మా బామ్మ.
మాగతి అధోగతే అన్నాడు తాత.

ఏ వేడుకయూలేవు మరే ఆర్భాటాలూలేవు.
రగిలే కుంపటినైనా మా కుటుంబానికి
కంటిపాపలా, ఇంటివెలుగులా పుట్టాడొక
తమ్ముడు.

పాలుమీగడలతో, బూంది లడ్లతో
పెరుగుతున్నాడు అబ్బురంగా.

కట్నకానుకలు చిక్కిపోయినా
కంటి కింపైన పుత్తడిబొమ్మనని
మహాసద్గుణవతినని నచ్చచెప్పాడు నాన్న.
అణగి మణగి వుండమంటూ అప్పగించింది
అమ్మ
పుట్టింటికి మెట్టి నింటికి ఘనకీర్తి
తెమ్మన్నది బామ్మ

అదొక పెద్ద మహలు
అందొక బంగారు పంజరం.
దాని కడ్డీలన్నీ వజ్రాలతో, రత్నాలతో
పొదిగారు.
అందు సర్వాభరణ భూషితయైన
నేను తల వంచి నిలబడ్డాను.

బంగారు గొలుసులతో సాక్షాత్కరించాడు నాపతి దేవుడు.
రత్నాలహారాలు మెడలో, బంగారు గాజులు చేతులకు,
రజితనూపురాలు పాదాలకు, వజ్రఖచిత వడ్డాణం నడుముకు.
చేతికి, కాలికి, నోటికి, నొసటికి తగిలించాడు మేలిమి గొలుసులు
"పతివ్రతవై వర్ధిల్లు" దీవించాడు నాయజమాని

నా సేవచేస్తూ, నా ఇంటిని సరిచూస్తూ, నాకు బిడ్డలనికంటూ
ఉత్తమ ఇల్లాలివై, ఆదర్శమహిళవై మసలుకో ప్రియా!
అంటూ ఆపాద మస్తకం తమిడాడు నా స్వామి.
మనసార నమస్కరించా నే సతిభక్తి ప్రపత్తులతో
అబ్బా! ఎంత అదృష్టం! ఎంతసౌభాగ్యం! అన్నారు అత్తమామలు

"సర్వాలంకార భూషిత, సర్వమంగళ శోభిత
స్వర్ణమందిర బంధిత సర్వబంధుజనక్షుభిత
పాపం! బంగారు పంజరంలో రామచిలుక!"
అంటూన్న ప్రతిధ్వనులు నా కర్ణకుహరాల్లో జొరబడ్డాయి.
నే నెవరినో నా కప్పుడర్థమయింది ! ! !

# మల్లాది సుబ్బమ్మ ఇతర గ్రంథాలు

## వ్యాస సంకలనాలు

| | |
|---|---|
| ఆధునిక స్త్రీ | 12 - 00 |
| మహిళాభ్యుదయం | 15 - 00 |
| మహిళాదశాబ్దం | 7 - 50 |
| స్త్రీ విమోచన | 7 - 50 |
| భావ వాహిని | 5 - 50 |
| ఓ మహిళా ముందుకు సాగిపో | 7 - 00 |
| మారుతున్న సమాజం - మహిళలు | 5 - 00 |
| తల్లే పిల్లను చంపితే? | 3 - 50 |
| విముక్తి ఉద్యమాలు, మహనీయులు | 3 - 50 |
| మనం దేనికి బానిసలం? | 3 - 50 |
| ఆంధ్రలో హేతువాద ఉద్యమ చరిత్ర | 2 - 00 |
| బంగారు సంకెళ్ళు | 10 - 00 |

## నవలలు

| | |
|---|---|
| ప్రేమ + సెక్సు = నీతి | 17 - 00 |
| కాంతి కిరణాలు | 12 - 00 |
| వెలిగిన జ్యోతి | 12 - 00 |
| ఈ దేశం నాదేనా? | 5 - 00 |
| చీకటి వెలుగులు | 10 - 00 |
| సామ్రాజ్ఞి రుద్రమదేవి (బాలల నవల) | 10 - 00 |

## కథలు

| | |
|---|---|
| మాతృత్వానికి మరోముడి | 20 - 00 |

## సంకలన గ్రంథం

| | |
|---|---|
| వివాహం : నేడు, రేపు | 20 - 00 |

## విమర్శనాత్మక గ్రంథాలు

| | |
|---|---|
| ఇస్లాం : స్త్రీలు | 15 - 00 |
| క్రైస్తవం : స్త్రీలు | 12 - 00 |
| హిందూమతం : స్త్రీలు | 12 - 00 |
| ఆం. ప్ర. లో మహిళోద్యమం : మహిళా సంఘాలు (1860-1984) | 15 - 00 |

## అనువాద గ్రంథం

| | |
|---|---|
| భారతనారీ ఆదర్శం! | 10 - 00 |

## ఇంగ్లీషు గ్రంథాలు

| | |
|---|---|
| Women, Tradition & Culture | 40 - 00 |
| Women in Revolt sage of struggle | 30 - 00 |
| Women's movement & Associations in A. P (1860 to 1984) | 20 - 00 |